# నేటి నటుడు వగైరా

మూడు నాటికలు ★ ★ ★

కొప్పరపు సుబ్బారావు

ది మోడర్న్ పబ్లిషర్స్ (రిజిష్టర్డు)
తె నా లి.
1946

 [వెల 1–4–0

నవజీవన గ్రంథమాల, తెనాలి—పుష్పం ౨

# నేటి నటుడు వగైరా

మూడు నాటికలు

- ★ నేటి నటుడు
- ★ చేసిన పాపం
- ★ అల్లీ ముఠా

కొప్పరపు సుబ్బారావు

# రంగసామగ్రి

టీపాయ్

టీపాయ్ చుట్టూ నాలుగు కుర్చీలు

సోఫా

కోట్ స్టాండ్

అద్దం టేబిల్

తివాచీలు

ప్రక్క తెరలో ఒక ద్వారం

ఆ ద్వారానికి కర్టెన్లు

(ఆ కర్టెన్లగుండా పాత్రల రాకపోకలు జరగాలి)

# నాటిక సామగ్రి

పేటి హార్మోనియం

తబలా,డగ్గా, సుత్తి, పిడీ వున్న సిలిగుడ్డ సంచి

రామశాస్త్రి చదివే ప్రశంసాపత్రం

రామశాస్త్రికి విజిటింగు కార్డు

కాఫీ కెటిల్, కప్పులు, సాసర్లు, ట్రేలు, బిస్కట్లువగైరా

సిగరెట్ హోల్డర్స్, సిగరెట్లు

రామశాస్త్రికీ మాధవరావుకీ చెరి వాక అగ్గిపెట్టె

రామశాస్త్రి చేతికి రిస్టువాచీ

# పాత్రలు

| | |
|---|---|
| నర్ కే. మాధవరావు, యం. ఏ., | మహానటుడు |
| రామశాస్త్రి. బి. ఏ., | నట—అభ్యర్థి |
| నాగలింగం | హార్మోనియమిస్టు |
| రంతు | తబర్జి. |
| వదేశం | మాధవరావుగారి ఇంట్లో బోయ్ (Boy) |
| మాలతి, యం. ఏ., | మాధవరావు భార్య |

## సూచిక

# నటులకు

## చిన్న సలహాలు

ఈ నాటికలను ప్రదర్శించడానికి ఉత్సహించే ప్రౌఢ మిత్ర (Amateurs) నటుల కోసమే ఈ సలహాలను ఉద్దేశించాను, పెద్ద నటులని పేరుమోగిన మన కిరాయి నటులకోసం కాదు సుమండీ.

....రచయిత.

**సమాజం**— సహృదయులైన కొందరు యువకులు కలిసి ఒక సమాజంగా ఏర్పడాలి. సమాజం అనేది లేకపోతే సక్రమంగా అభ్యాసం (హార్సల్) జరుగుట కల్ల. సక్రమాభ్యాసం లేకపోతే నాటకప్రదర్శనం సంతబజారుగా తయారవుతుంది.

**దర్శకుడు**—సామాజికులు తమలో ఒకరిని దర్శకుడు (Producer or Conductor) గా నిర్ణయించుకోవాలి. ఇతడు చెప్పినట్లు నడుచుకుంటామని సామాజికులంతా శపథం చెయ్యాలి. దర్శకుడికి నాటకంలో పాత్రధారణం ఉండరాదు. కాని అతడు నాటకాన్ని ఆమూలాగ్రంగా అనేకసార్లు పఠించి, అందలి ప్రతిపాత్రనూ చక్కగా అవగాహన చేసుకోవాలి. ఏపాత్రను ఏ నటుడుకిస్తే సమంజసంగా వుంటుందో అతడే నిర్ణయించాలి. ఆ నిర్ణయాన్ని నటులంతా ఆమోదించాలి. అభ్యాసాలన్నీ అతని యాజమాన్యంక్రింద జరగాలి. అభ్యాస సమయాల్లో నటుల హావభావాదులనుగమనిస్తూ వారితో కలసి మెలసి మనస్సులు నొచ్చకుండా, వలసినచోట్ల దిద్దుతూ వుండాలి. 'ఇది

ఇలా వుంటేనే తప్ప 'నేనుఒప్పుకోను' అని దర్శకుడు నటుణ్ణి నిర్బంధించకూడదు. మరి 'అయితే, మీ యిష్టం వచ్చినట్లు ఏడ్చుకోండి' అని విడిచిపెట్టనూకూడదు. ఉత్తమ దర్శకుడికి ఓపిక ఒక ముఖ్యలక్షణం. నటుల విశ్వాసాన్ని పొందగలుగుట మరో ముఖ్యలక్షణం. దర్శకుడు తానుకూడా ఒక ప్రేక్షకుడననే దృష్టితో అప్పుడప్పుడు దూరదూరంగా నిలిచి పాత్రధారుల సంభాషణలనూ హావభావాలనూ గమనిస్తూవుండాలి కంఠస్వరాల హెచ్చుతగ్గులనూ హావభావాల స్పష్టతాస్పష్టతలనూ సంస్కరిస్తూవుండాలి. ప్రారంభ మొదలు భరతవాక్యము వరకూ గల ప్రదర్శన వ్యవహారమంతా అతని శాసన ప్రకారం నడచినప్పుడే ప్రదర్శనం విజయవంతంగా వుంటుంది. లేకపోతే ప్రవేశనిష్క్రమణాలు సకాలానికి జరగవు. ఎక్కవలసిన తెర యెక్కదు. దిగవలసిన తెర దిగదు. ధ్వనివెంటనే దృశ్యం రాదు. నాటకం నిజంగా బూటకం మవుతుంది.

**రంగం** — రంగస్థలంమీద ప్రతి నటుడూ అందరి దృష్టికీ కనపడే స్థానంలోనే ఉండాలి. తన సంభాషణలు అందరికీ వినపడుతున్నాయా లేదా, తన హావభావాలు అందరికీ కనబడుతున్నాయా లేదా అని గమనించుకుంటూవుండాలి. ఒక నటుడు మరో నటుడికి అడ్డంగా నుంచోవద్దు. నటులకూ ప్రేక్షకులకూ మధ్య అవరోధంగా నిలవవద్దు.

**హావభావాలు** — రంగస్థలంమీద నటునియందు కనిపించే ప్రతి చలనానికి ఉద్దేశం ఉండాలి. ఉద్దేశరహితంగా కాళ్ళూచేతులూ ఊగిసలాడిస్తూవుండుట అసహ్యం. ప్రతి మాటకూ అర్థంవుంటుంది. అర్థాన్నిబట్టి భావం వుంటుంది.

భావాన్నిబట్టి హావం (Expression) ఉంటుంది. కాబట్టి ప్రతి నటుడూ తన మాటలను అర్థంచేసుకొని, అందలి భావాన్ని ఆస్వాదింపగలిగితే, రంగస్థలంమీద వాటిని ప్రసంగించేటప్పుడు హావం తనంతట అది రాక తప్పదు. అయితే దీనికి నిరంతరకృషి చెయ్యాలి.

**సంభాషణలు** — చెప్పేది స్పష్టంగా చెప్పు. వాక్యంలో చివరి అక్షరాలను మింగకు. హీనస్వరముతో వాటిని జారవిడవకు. సంభాషణలను బట్టీపట్టి అప్పగిస్తున్నట్లు చెప్పకు. సరళంగా అప్రయత్నంగా చెప్పు. సంభాషణలలో మధ్యమధ్య నిర్నిమిత్తముగా విరామం తీసుకోవద్దు. విరామాన్ని అభినయముతో పూరించ దలచుకుంటే ప్రశంసాపాత్రమే. కాని ఆ అభినయం అప్రస్తుతంగావుంటే ఆసంభాషణల విలువకూడా పోతుంది. నాటకాల్లో అక్కడక్కడ 'అర్థోక్తు'లు తగులుతూవుంటయ్. ఆసందర్భాలలో హుషారుగా వుండు.

'చేసిన పాపం' నుంచి ఒక ఉదాహరణం—

రాజ. ఏమీ? మందలో నొకడనా? నేను!నలాందారాజ్య—

భిక్షు. జీర్ణశిధిల—

రాజ. సింహాసనాధిష్టాతను మందలో నొకడనంటావా?

రాజకుమారుడు అహంకారముతో 'నలాందారాజ్య సింహాసనాధిష్టాతను' అని అంటూవుండగా మధ్యన 'జీర్ణ శిధిల' అనే అపహాస్యాన్ని భిక్షువు ఇరికించాడు. ఈ సందర్భంలో రెండు ప్రమాదాలు వున్నయ్. 'జీర్ణశిధిల' అన్నేమాటలు భిక్షువుకు వున్నవనే ఉద్దేశంతో, రాజకుమారుడు గభాలున అక్కడ ఆపడం ఒకటి—నకాలానికి అప్రయత్నంగా భిక్షువు

అందుకోకపోవడం ఒకటి. ఈ ప్రమాదాలు సంభవించకుండా కట్టుదిట్టంగా అభ్యాసం చెయ్యాలి.

**శ్రవణం** — సంభాషణ ఎంత ముఖ్యమో శ్రవణం (వినడం) అంత ప్రధానం. ఇద్దరుంటేనేగాని సంభాషణకాదు — చెప్పేవాడూ, వినేవాడూ. ఒక నటుడు సంభాషిస్తూ వుండగా వినవలసిన రెండో నటుడు వినకుండా పరధ్యానంగా వుంటే ప్రేక్షకులకు ఆ యిద్దరిపట్లా పరధ్యానం కలుగక తప్పదు. తానే వినకపోతే ప్రేక్షకులు అంతకన్నా వినరు. ఒకరు శ్రద్ధగా వింటూన్నప్పుడే ఇతరులకుకూడా వినాలని ఆశ కలుగుతుంది. ఈ రహస్యం మరవకు. అభ్యాససమయాల్లో ఎన్నిసార్లు ఆ సంభాషణలను నీవు వినివున్నప్పటికీ, రంగస్థలంమీద మాత్రం వాటిని కొత్తగా అప్పుడే వింటున్నట్లు నటించు.

**జ్ఞాపి** (Prompter) — జ్ఞాపకం చేసేవాడు కాబట్టి జ్ఞాపి (ప్రాంటర్). దర్శకుడుగాని, దర్శకుడిమాదిరిగా నాటకాన్ని ఆమూలాగ్రంగా అనేకసార్లు పఠించిన మరొకరుగాని ఈ జ్ఞాపిఉద్యోగం నిర్వహించాలి. అభ్యాససమయాల్లో అతడుకూడా నిత్యం హాజరై పాలుగొనాలి. సాధారణంగా ఏ నటుడు ఎక్కడెక్కడ కథను మరిచిపోవడం జరుగుతూవున్నదో అతడు బాగా గ్రమనించాలి. ఆ తప్పు జరగకముందే అతడు జాగ్రతగా అందించాలి. చెవులకింద అరిచే రొదగా ఆదినుండి అంతందాకా నాటకాన్ని చదువుకుపోవడం జ్ఞాపికి అనవసర ప్రయాస. నటులకు కావలసింది ఎక్కడో ఒక మాట. అది అందించడంలో హుషారుగా వుంటే చాలు. నటులుతమ సంభాషణలలో కొన్నిటిని మరచిపోతూ వుండటం సహజం.

ఆ మరచిపోయినమాట అంత ముఖ్యమైనది కాకపోతే, దాన్ని అందించడానికి అదేపనిగా యత్నం చెయ్యొద్దు, అది అతి ముఖ్యమైనమాట అయితే, తప్పకుండా వెంటనే (బిగ్గరగానైనా సరే) అందించు. అలాంటి ఘట్టాలల్లో ఒకప్పుడు నీ కంఠస్వరం ప్రేక్షకులదాకా వినిపించినాసరే, పరవాలేదు—క్షంతవ్యం. కాపి తన పనిలోనిమగ్నమై వున్న సమయంలో ఎవరైనావచ్చి ఆసక్తితో బాతాఖానీ మొదలు పెడితే, తెరదిగిన వెంటనే ఆ బాతాఖానీదారుని ప్రక్క తెర(సైడ్ వింగు) స్తంభానికి కట్టివేసి పాతచెప్పుతో పది పాతిక దెబ్బలు కొట్టండి.

రచయిత

## మనవి

ఈ మూడు నాటికలూ కలిపి ఆడితే సుమారు మూడు గంటల కాలం పడుతుంది. 'నేటివటుడు' నాటకం ఒక గంట—'చేసిన పాపం' నలభై నిమిషాలలోపు— 'ఇస్త్రీమణా' (గేయాలు సహా) దాదాపు ఒక గంట — మూడు నాటికలకూ మధ్య రెండు విరామాలు ఒక్కొక్కటి పదేసి నిమిషాలు — మొత్తం ఇంచుమించుగా మూడుగంటలు.

ఈ సంపుటంలోని మూడు నాటికలూ ఏక్రమంలో ముద్రితం అయివున్నవో ఆక్రమంలోనే ప్రదర్శిస్తే బాగుంటుంది. ఎందుకంటే మొదటినాటికలో పాల్గొనే నటులకు, మూడో నాటికలో పాల్గొనడానికి కూడా అవకాశం వుంటుంది. మొదటి నాటికలో ఆరుగురూ, రెండో నాటికలో నలుగురూ. చివర నాటికలో తొమ్మండుగురు, మొత్తం 19 మంది పాత్ర

ధారులు వున్నారు. కాని 19 మందీ అవసరం లేదు. మొదటి నాటికలో నటులు మూడో నాటికలోకూడా వేషాలు వేస్తే మొత్తం 11 గురు సరిపోతారు (తొమ్మండుగురు పురుషులూ ఇద్దరు స్త్రీలూ).

ప్రాథమికుల (Amateurs) కోసం అక్కడక్కడ కొన్ని సలహాలు ఇచ్చాను. వారికి అవి సహాయపడగలిగితే ధన్యుణ్ణి. ఈ నాటికల కు 'తొలిపలుకు' వ్రాసి యిచ్చిన శ్రీయుత స్థానం నరసింహారావుగారికీ, నవజీవన్ గ్రంథమాలలో రెండో కుసుమంగా దీన్ని ప్రకటించిన సంపాదకులు శ్రీయుత మొవ్వా వీరారెడ్డిగారికి, శ్రద్ధతో దీన్ని ముద్రించి సకాలానికి అందించిన శ్రీ లక్ష్మీ పవర్ ప్రెస్ వారికీ నా ధన్యవాదాలు.

తెనాలి,<br>4—4—44

కొప్పరపు సుబ్బారావు,<br>రచయిత.

## హెచ్చరిక

లిఖితపూర్వకమైన నా అనుమతిని పొందకుండా ఈ నాటికలను ఎవ్వరూ ప్రదర్శించకూడదు ధనకాంక్షచేత చేస్తున్న నియమం కాదిది. వీటిని ప్రదర్శించేవారు నాకు ఏమీ ఇవ్వనక్కరలేదు. వీటిని చక్కగా అభ్యాసం చేస్తామని తృప్తికరంగా ప్రదర్శిస్తామనీ నాకు మాటయిస్తే చాలు. వారికి నా అనుమతిని ప్రతిఫలాపేక్ష రహితంగా ఇస్తాను.

4—4—44<br>తెనాలి

కొప్పరపు సుబ్బారావు.<br>రచయిత.

ప్రదేశం-బెజవాడలో సర్ మాధవరావుగారి మేడ

దృశ్యం—సర్ మాధవరావుగారి మేడలో మొదటి అంతస్తులో వున్న డ్రాయింగురూములోకి హార్మోని యమిస్టు నాగలింగంతోనూ తబలిస్టు రంతుతోను రామ శాస్త్రి ప్రవేశం.

రామశాస్త్రికి సుమారు 30 వయస్సు. బి. ఏ, పట్ట భద్రుడు. అయితే, అతని వేషం మామూలు బి. ఏ.ల లాగా లేదు. నెత్తిమీద జరీ మడత తలపాగా - కళ్ళకు వెండి అద్దాలజోడు - చెవులకు చిన్ననాటిబంగారు పోగులు - ఓపెన్ కాలరు లేని నల్ల లాంగ్ కోటు - బిళ్ళకట్టు ధోవతి - మడత జరీ వల్లెవాటు - వెండిపొన్ను చేతికర్ర-నాటు చెప్పులు-నుదురుమీద త్రిపుండ్రం.

నాగలింగానికి సుమారు 26 వయస్సు. నెత్తిమీద ఫెజ్ టోపీ, కళ్ళకు నల్ల ఫ్రేమ్ అద్దాలు, తెల్లషర్టు మీద ఓపెన్‌కాలర్ కోటు, బిళ్ళగోచి కాన్వాసు బూట్లు, చేతి హార్మోనియం వొకటి చంకలోవుంది.

రంతుకు సుమారు 38 వయస్సు. క్రాఫింగు జుట్టు-క్రాపింగుమీద షోకుగా చేతి రుమాలుతో కట్టుబిగింపు-లోపల వల బనీను- పైన పక్క మెడ గ్లాస్కో జుబ్బా-కింద రంగు రంగుల గళ్ళలుంగీ - కాళ్లకుబర్మాచెప్పులు. ఒక నీలిగుడ్డ సంచిలో తబలా దగ్గా సుత్తి పిడీ వున్నయ్. ఆ సంచిని చేత్తో పట్టుకున్నాడు.

రామ. అయితే, నాగలింగం! ఆ పద్యానికి దేవగాంధారే బెస్టు అంటావా? (సోఫాలో కూర్చుంటాడు)

నాగ. (హార్మోనియము తివాచీమీద దింపుతూ) ఔనండీ తేటగీతాలన్నిటికీ దేవగాంధారే బెస్టు.

రామ. సీసపద్యాలకో?

నాగ. త్రిరాగం.

రామ. కందపద్యాలకి?

నాగ. కాంభోజి. పద్యానికీ, రాగానికీ, ఈవిధంగా టకీ టమీ మని యతిప్రాసలు కుదిరితే ఆ మజానం ఇక అడగాలా?

రామ. అలాగైతే, మన నటకుల్లో ఒక్కరు కూడా అలా పాడటం లేదే?

నాగ. మన నటకులకు ఏం తెలుసునూ? పైపెచ్చు రాగాలన్నిటినీ పులగం వండి సంగీతాన్ని ఖూనీచేశారండీ! ఖూనీ! ఏమిటో బీంప్లాసుట! జింగ్లాట! తిలాంగుట! బిభాసుట—అభాసు! మియ్యామల్లారుట—వల్లకాటి మల్లారం! రామ రామ! ఈ నాటకసంగీతం అటు దక్షిణాది సాంబారూ కాదు—ఇటు ఉత్తరాది పచ్చిపులుసూ కాదు (చూశావా నా పాండిత్యం అన్నట్లు సగర్వంగా రంతూకేసి చూస్తాడు. ఇలా చూడటం అతనికి బాగా అలవాటు)

రంతు. సచ్ హై సాబ్-సచ్ హై! మన హక్కెళ్లంతా రాగాన్ని— ఘట్టి బిర్యానీ బనాయా! తాళాన్ని— ఘట్టి పలావ్ బనాయా! (తబలాల సంచిని తివాసీమీద దింపుతాడు)

రామ. రంతూ! ఇప్పుడు మనకు కావలసిందేమిటంటే, మీ యిద్దరూ మీ అమోఘపాండిత్య సహాయంచేత నా పాటకీ నా యాక్షనుకీ అందం తెచ్చి, సర్ మాధవరావు గారు నన్ను శాబాస్ అనేటట్లు చెయ్యాలి.

నాగ. అదెంత పనండీ! రంతూ నేనూ తలుచుకుంటే రాళ్ళయినా సంగీతం పాడాల్సిందే.

రంతు. సచ్ హై సాబ్.

రామ. అయితే, మాధవరావుగారు రాకముందే ఆ పద్యమూ కీర్తనా మళ్లీ ఒక్కసారి రిహార్సలుచేద్దామా?

నాగ. ఓ, అవశ్యం (హార్మోనియం హార్మోనిని 4½ శ్రుతి వేస్తాడు)

గంతు కూడా హార్మోనిని తబలా శ్రుతిచేస్తాడు.

నాగ. ఇహ కానియ్యండి శాస్త్రిగారు! ముందు పద్యమా కీర్తనా?

రామ. పద్యమే. ఎంత శ్రుతి పట్టావు?

నాగ. మీ శ్రుతేనండీ — నల్లమూడు — బ్లాక్ త్రీ!

రామ. నల్లమూడా? (గొంతు సర్దుకుంటూ) ఇవ్వాళ ఇడ్లీ కొంతల్లో ద్వాదశంగా పడ్డాయ్. గొంతు లేవదేమో అని అనుమానంగావుంది నల్లమూడు వద్దు — తెల్ల నాలుగు పెయ్ — వైట్ ఫోర్!

నాగ ఓ మీయిష్టం. గంతూ! శ్రుతి తగ్గించుకో. (హార్మోనియం మీద నాలుగో శ్రుతి అందిస్తాడు)

గంతు. హెంయ్యా—హాండీ? ఆదా శ్రుతేగా వేదం? తబ్లా మొహంమీద ఖపడా ముస్గుయేసి వాయిస్తాలెండీ మహరాజ్! (నెత్తికి కట్టిన చేతిరుమాలు విప్పి తబ్లా మొహం మీద కప్పి చాటుతాడు. ఇప్పుడు ఏ శ్రుతో ఎవడు చెప్పగలడు?)

నాగ. భేష్! అలా వుండాలి హుంపారంటే. ఇహ కానియ్యండి శాస్త్రిగారు! ఏ రాగం వాయించమంటారు? దేవగాంధారేనా?

రామ. ఔను. తేటగీతానికి దేవగాంధారేగా బెస్టు?

నాగలింగం దేవగాంధారిని అందిస్తాడు.

రామ. (జేబులోనుంచి ఒక కాగితం తీస్తాడు. గొంతు సర్దుకుంటాడు)

రంతూ! సర్ మాధవరావుగారిమీద, ఈ గీతపద్యాన్ని నేనే కవికట్టాను సుమా!

రంతు. హల్లా హైతే మంచి నాటక్ హూక్కీ రాసి, కొత్త కంపెనీ ఫెట్టి ధుమా ధుమా సెయ్యండి మహరాజ్!

రామ. ఆ వుద్దేశం లేకపోలేదు. రంతూ! నాటకం వ్రాయాలనీ, కంపెనీ పెట్టాలనీ, అందులో హీరో-అంటే కథానాయకుడి పాత్ర—మనమే గ్రహించాలనీ చాలానుత్సాహంగా వుంది. ఆ విషయంలో సర్ మాధవరావుగారి సలహా తీసుకోవాలనే ఇక్కడికి వచ్చాను. సర్కారువారిచేత సర్ అనే బిరుదంపొందిన ఆ ఘనవంటి మహానటుడి ముందు ఒక్కసారి నాపాటా నాహిస్ట్రియానిక్సూ—

నాగ. అంటే మూర్ఛరోగం కాదటండీ?

రామ. అబ్బే! అది హిస్టీరియా — ఇది హిస్ట్రియానిక్స్ — అంటే నాట్యకళ. ఇహ ఆరంభం చెయ్యండి మన ఫైనల్ రిహార్సలు.

నాగలింగం మళ్ళీ అందిస్తాడు దేవగాంధారి

రాము. (గొంతు మళ్ళీ సద్దుకొని, కాగితం కేసి చూసి) మరిచిపోయా. నాగలింగం! కొంచం ఆగు. పద్యానికిముందు రవ్వంత ఇన్ట్రొడక్టరీ — అంటే ఉపోద్ఘాతరీతిగా —చిన్న వచనంకూడా వ్రాశాను. విను! (కాగితం చూస్తూ చదువుతాడు.) "శ్రీయుత సర్. కే. మాధవరావు మహానటకులుంగారికి. శ్రీ పి. ఆర్. శాస్త్రి బి. ఏ.. సమర్పించిన ప్రశంశాపత్రం. హే నటశార్దూలమా! నీవంటి నటపితామహుణ్ణి కడుపారా కన్నందుకు(!) (శాస్త్రికి ఉద్రేకం వచ్చినప్పుడల్లా భాషకీ భావానికీ

ఈవిధంగా బలాత్కారం జరుగుతూ (ఉంటుంది) ఈ యాంధ్రమాత – ఆంధ్రమాతయేకాదు, యావద్భారతమాత, అమందానంద కందళిత హృదయారవిందంలో (!) ఓల లాడుతూంవుది. ఓ ఆంధ్రులసౌభాగ్యమా! ఘనతవహించిన సర్కారువారు మీకు 'సర్' అను బిరుదము నొసంగినందుకు (!) ఆంధ్రులెల్లరు అఖండ ప్రమోదమున మునింగి యున్నారు. ఓ కళావంతుడా! చంద్రుని కొనసూలు పోగను చందమ్మున ఈదిగువ తేటగీతిని దేవగాంధారి సహిత ముక్తిగా (!) సమర్పించుకొనుచున్న సుజన విధేయుడు, నాట్య కళాభిమాని, ఇట్లు పి. ఆర్. శాస్త్రి బి. ఏ.,"—ఏలా వుందటావ్ నాగలింగం?

నాగ. అద్భుతంగా ఉంది.

కంతు. బహుత్ అచ్ఛాహై సాబ్.

రామ. హి హి హి! ఇక వాయించు దేవగాంధారి.

నాగలింగం వాయిస్తాడు

రామ. (ఆఖరుసారి గొంతు సర్దుకుని, ఆరంభించాడు)

"నాట్యకళ యను చెరువులో నడిమిస్తంభం!"

అంటే–ఓ సర్ మాధవరావుగారు! చెరువులో స్తంభం ఎంత ప్రాముఖ్యంగా కనపడుతుందో, ఈ ఆంధ్రుల నాట్యకళ అనే అగాధ చెరువులో నీవు అంత ప్రముఖుడవుగా కనపడు చున్నావుసుమా అని ధ్వని. దీన్నే ఇంగ్లీషులో సజెస్టివ్ అంటారు. ఇది ఉత్తమకవిత్వానికి గుండెకాయ వంటిది.

నాగ. బలే మజాగా వుంది (కంతూకేసి చూపు)

రంతు. హాఁ హాఁ! శాస్త్రీర్ సాబ్కా నోరూ హాంతా షక్కర్ మీఠా! షక్కర్ మీఠా!

రామ. ఇహ రెండో చరణం రిహార్సలు.

నాగలింగం మళ్లీ హార్మోనియం

రామ. "నాట్యపాకములందెల్ల నారికేళ!"
అంటే— సర్ మాధవరావు మహాశయుగారూ! కవిత్వంలో నారికేళపాకానికి ఎంత గాంభీర్యం - అంటే డెప్తు (Deapth) —వుంటుందో, నాట్యంలో నీ నాటకానికి అంతమజావుంది సుమాఅని ధ్వని. ఇహ చివర రెండు చరణాలు—

"మంచి నటుడవయ్యా ఓ మాధవుండా!
ఉర్వి యాంధ్రులలో నెల్ల ఉత్తముండవు."

పద్యం చివర శాస్త్రి దేవగాంధారితో ద్వందయుద్ధం చేస్తుండగా నటేశం ప్రవేశం. నటేశం సర్ మాధవరావుగారి ఇంట్లో రెండేళ్ళ నుంచి పనిచేస్తున్న ఉడిపి బ్రాహ్మణ కుర్రవాడు. సుమారు 18 వయస్సు. మంచి అందంగానూ హుషారుగాను వుంటాడు. గాంధీటోపి, తెల్లటిచొక్కా, తెల్లటిలాగు.

నటే. (ప్రవేశిస్తూనే) ఎన్నాంగో సార్! — సార్! — సార్! — ఇంగె గోలాగేలా ముడియాదు. (పైనున్న మేడకేసి చూపిస్తూ) అమ్మగారు రొంబకోపంచేస్తారుసార్!

రామ. మేము సర్ మాధవరావుగారి దర్శనంకోసం వచ్చాము. ఇవ్వాళ ఉదయం 8 గంటలకి వారు నాకు అపాయింటుమెంటు ఇచ్చారు. (జేబులో నుండి విజిటింగు కార్డుతీసి) ఇదిగో నా విజిటింగుకార్డు. తీసుకువెళ్ళి వారికిచూపించు.

అటుండగా సర్ మాధవరావు ప్రవేశం

మాధవుడి వయస్సు సుమారు 32. పొడవటి, పొడుక్కు తగిన అవయవపుష్టి, విశాలమైన నుదురు, దట్టమైన కనుబొమ్మలు, కళ్ళు ఆట్టే పెద్దవి కాకపోయినా. చూపుల్లో నిబిడ నిర్మల తేజస్సు, అచంచలమైన ఆత్మ విశ్వాసాన్ని సూచించే గంభీర ముఖ వైఖరి, కాని, వాటిల్లో ఏమీ డాబుదర్పాలు కనిపించడం లేదు. అతాత్తుగా చూసినవాళ్ళు ఆయన్ని ఒక నటుడని కాని, సర్కారుచేత 'సర్' అనే బిరుదు పొందతగిన మహా నటుడని గాని గుర్తించుట కష్టసాధ్యం. మాధవరావు రావడం తోనే ముగ్గురు లేచి నమస్కారం చేస్తారు. ప్రతినమస్కారం చేస్తూ మాధవరావు రామశాస్త్రిని బాగా పరీక్షించుతాడు. వెంటనే పూర్వస్నేహం జ్ఞప్తికి వచ్చినట్లు—

మాధ. హలో ! రామూ !

రామ. జ్ఞాపకం ఉన్నానా మాధూ!—

ఇద్దరూ షేక్‌హేండ్

మాధ. నీవిజిటింగు కార్డుమీద పి. ఆర్ శాస్త్రి అని ఉంది. ఎవరోకదా అనుకున్నా. రామూ! నన్ను చూడటానికి ఇంత అట్టహాసం చెయ్యాలా? నీసహాధ్యాయినన్న సంగతి మరిచి పోయావా?

రామ. లేదు. కాని, నీవే మరచిపోయివుంటావని అనుకున్నా. మాధూ ! ఈయన మన వూళ్ళో కల్లా చాలా బెస్టుహార్మోనిస్టు మిస్టర్ డి. నాగలింగం.

మాధ. చాలా సంతోషం. (నాగలింగానికి షేక్‌హేండ్)

రామ. ఈయన తబలా ధురంధర (!) శ్రీయుత రంతుమియా!

మాధ. బహుత్ ఆనంద్ ! (రంతుకు షేక్‌హేండ్)

శంతు. అబ్బ్కాదయా ! అబ్బ్కాదయా !

మాధ. (ద్వారం వైపుతిరిగి) నటేశ!— బోయ్!—

నటే. (ప్రవేశించి) యస్ మాస్టర్!

మాధ. (నాగలింగాన్ని చేతుసూ చూపిస్తూ) వీ రిద్దర్నీ లోపలికి తీసుకువెళ్ళి ఫలహారం కాఫీ యిప్పించు. మా యిద్దరికీ ఇక్కడే తెచ్చి పెట్టు.

నటే. యస్ మాస్టర్! (ఆ యిద్దరితోనూ నిష్క్రమణం)

రామ. మాధూ! నీవు చాలా అదృష్టవంతుడవోయ్.

మాధ. ఏమో — కొంతవరకు.

రామ. కొంతవరకేనా? నేను నమ్మను.

మాధ. ఎందుకని?

రామ. వయస్సా నడియౌవనం - వృత్తి చూద్దామా సర్వదా ఆనందంలో ముంచితేల్చే నాట్యకళ - నీవా దేశంలోకల్లా సర్కారువారిచేత సర్ అను బిరుదు పొందిన ఏకైక ఆంధ్ర నటుడవు. కీర్తికి కీర్తి - డబ్బుకు డబ్బూ -

మాధ. (జేబులు తడుముకోవడం అభినయిస్తూ) ఏదీ?— ఎక్కడ?

రామ. ఆమధ్య ఎప్పుడో మద్రాసు బీచిమీద కారులో విహారం చేస్తూ బాంకి నోట్లు ఎడా పెడా వర్షించావటగా?

మాధ. నేనా? !— లోకం అలా చెప్పుకొంటున్నదా ?— ఇదీ ఒక మేలే. అప్పులవాళ్ళు ఎగబడను.

(నటేశం ప్రవేశం. కాఫీకెటిల్, కప్పులూ, సాసర్లూ, చెంచాలు, బిస్కట్లూ, పళ్ళూ వగైరాలు టీపాయ్‌మీద పెట్టి, చుట్టూ కుర్చీలు సర్ది వెళ్ళిపోతాడు. ఇద్దరూ కుర్చీలల్లో కూర్చుంటారు. ఇకనుండి జరిగే సంభాషణ ఫలహార సమేతం.)

రామ. మాధూ! ఇకేంటి కావాలోయ్ నీకు? ఈ దేశంలో ఏ కాఫీహోటళ్ళలో చూసినా ఏ షాపుల్లో చూచినా నీ ఫోటోయే. నాటకంలో నీవు వేషం వేస్తే నాలుగు వేలు కలెక్షన్. ఇవ్వాళ బెజవాడ — మరొకనాడు సికింద్రబాదు — ఇంకోనాడు మద్రాస్ — మరోనాడు బెంగుళూరు —

మాధ. ఇదంత సుఖజీవనమే అని అనుకుంటున్నావా?

రామ. నేనూ నీవంటి నటకుణ్ణయితే, ఇలాంటి వేదాంతం ఎంతయినా చెప్పగలను. మాధూ! నీకుమల్లే నాకూ ఆటకు నాలుగు వందలు చెప్పున ఇచ్చి, రానూ పోనూ డబుల్ ఫస్టుక్లాసు టిక్కెట్టిచ్చి, అది చాలక సర్కారువారు సర్ అనే బిరుదిచ్చి, వీటికితోడు ఆంధ్రదేశంలోకల్లా యం.ఏ. ఫస్టుగా ప్యాసైన మోస్టు సివిలైజ్డ్ గరల్ నన్ను లవ్ చేసి పెళ్ళాడితే, నేనూ తీరిగ్గా కూర్చొని అనగలను. 'ఇదంతా సుఖజీవనమా' అని.

మాధ, (నవ్వి) రామూ! ఈ మెట్టు అందుకోడానికి నేను పడిన శ్రమ యెంతో నీకు తెలియదు.

రామ. శ్రమ? అంతకంటే నూరంతలు శ్రమచేస్తా నేను—మరి నాకు అందుతుందా ఆ మెట్టు? చూడు! నీలాగే నేనూ అందచందాలు కలవాణ్ణే.

మాధ. నాకంటె ఎక్కువకూడా.

రామ. వయస్సుకూడా దాదాపు సమానం.

మాధ.. ఔను.

రామ. చదువులో నీకు ఎంతమాత్రం తీసిపోను.

మాధ. నీవు బి. ఏ. లో సంస్కృతంకూడా ప్యాసైనట్లు జ్ఞాపకం.

రామ. (చాలా పరితాపంతో) అటువంటినాకు ఊరూ పేరూ,

వుందా? నా ఫొటో ఉచితంగా యిస్తానన్నా పుచ్చుకునే వాళ్ళు వున్నారా? రోజుకు నాలుగు వందలు సంపాదిస్తున్నానా? నాలుగువందలు కాదు - డెసిమల్ నాలుగు దమ్మిడీలుకూడా లేవు.

మాధ. అధైర్యపడకు - ఎప్పటికైనా వస్తుందేమో మంచిరోజు.

రామ. (ఇంకా సింహాసనంలోనే వున్నాడు) నేను ఫస్ట్ క్లాస్‌లో ప్రయాణం చేస్తున్నానా? రైలు దిగడంతోనే నా మెడలో పుష్పహారాలు వేస్తున్నారా? అదీగాక బ్యూటిఫుల్ గర్ల్సు ఎవరైనా నాకు లౌవ్ లెటర్సు వ్రాస్తున్నారా?

మాధ. వ్రాస్తారు - వ్రాస్తారు.

రామ ఔను. ఎందుకు వ్రాయకూడదూ అని నాప్రశ్న. నాఅంద చందాల్ని ఈ దేశం ఎందుకు గమనించడంలేదు అని తీవ్రంగా అడుగుతున్నా.

మాధ. ఔను. అడగవలసిన ప్రశ్నే.

రామ. మాధూ! ఈ ఆంధ్రదేశంలో ఉన్నంత పక్షపాతం మరేదేశంలోనూ లేదు.

మాధ. కొన్నాళ్లు శ్రమపడాలి నీవు - ఫలితం అదే వస్తుంది.

రామ. ఎప్పుడు? చచ్చినతర్వాతనా?— కాదు! (కుర్చీలోనుంచి తటాలున లేచి, బాగా ఊపిరితీసుకుని) మాధూ! ఇక విను! ఇవ్వాళ - అంటే, ఈ వైశాఖ బహుళ ద్వాదశి నాడు, ఉదయం (రిస్టువాచికేసి చూసి) ఎనిమిది గంటల పద్దెనిమిది నిమిషాలకు - అమోఘమైన, అఖిలాంధ్రనాట్య కళాచరిత్రలో సువర్ణాక్షరాలతో చెక్కించబడతగిన, మహా శపథం చేస్తున్నా విను! ఈ రామశాస్త్రి ఇకనుండి

నాటకాల్లో హీరో పాత్రధరించి, ప్రేక్షకుల మెప్పు వహించి ఆంధ్రనాట్యకళను ఉద్ధరించుతాండె! ఇందుకు తప్పనియెడల ఆత్మహత్యను కావించుకొనుతాండె!

మాధ. (కుర్చీలో విరగబడి నవ్వుతాడు)

రామ. నవ్వు! ఇంకానవ్వు! (ఛాతీమీద కొట్టుకుంటూ) ఇది రావణా గుండె! దీని సంకల్పానికి తిరుగులేదు. లేదు.

మాధ. కాఫీముగించు - చల్లారిపోతున్నది.

రామ. నేను త్రాగను. (బల్లమీదగుండా చెయ్యి సాచి నటకుడి లాగ పోజ్ పెట్టి) నీ సలహా, నీ సానుభూతి, నీ సహాయం నాకుకావాలి. ఇస్తావా? ఇస్తావా? మాట్లాడవేం? —— —— ఓహో! తెలుసుకున్నా. అర్థమైంది. నన్ను చూసి భయపడుతున్నావు. నేను పైకి రావటం నీకు గిట్టదు.

మాధ. రామూ! నీ మనస్సు కష్టపెట్టడం నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు. అయినా చెప్పక తప్పదు.—

రామ. చెప్పు. నీవు చెప్పబోయేదేమిటో నేను గ్రహించక పోలేదు.

మాధ. నీకు లోకంలో వున్న అన్ని కళలూ అన్ని విద్యలూ సులభంగా సాధ్యమైతే కావచ్చు. నాట్యకళ ఒక్కటీ మాత్రం దుస్సాధ్యం. దానికీ నీకూ చుక్కెదురు.

రామ. (రోషం) ఎందుచేత?

మాధ. నటుడికి వుండవలసిన లక్షణాలు నీలో లేవు.

రామ. (కసి) ఏమిటా లక్షణాలు?

మాధ. లక్షణాలసంగతి అలా వుంచి, ముందు నీలో వున్న

అవలక్ష

అవలక్షణాలను గూర్చి చెబుతావిను.

రామ. యస్. యస్. చెప్పు.

మాధ. మొదటి అవలక్షణం — ఈ బల్లకు ఎంత భావప్రదర్శన శక్తి వుందో నీముఖానికీ అంతే వుంది.

రామ. అదేమి? నేను నవ్వాగలను. ఏడవాగలను.

మాధ. మానవులై పుట్టినందుకు ఆ రెండూ అందరికీ తెలుసు.

రామ. స్టేజిమీద వొకప్పుడు సమయానికి ఏడుపు రాదనుకో అప్పుడు అమాంతగా హాండ్‌కర్చీఫుతో కళ్లు రెండూ గట్టిగామూసుకుంటూ. తర్వాత నిట్టూర్పులు — గుక్కిళ్లు — ఎక్కిళ్లు — మధ్యమధ్య చీదులు. ఓహ్! ఈ ట్రిక్కులన్నీ తెలియని చవట, వాడూ ఒక నటుడేనా?

మాధ. నిన్ను చూసి నవ్వాలో ఏడవాలో తెలియకుండావుంది. కూర్చో. ముందు కాఫీ తాగు. చల్లారిపోతున్నది.

రామ. నన్ను పూర్తిగా డిస్కరేజ్ చేస్తున్నావు.

మాధ. రామూ! ఏడుపుకు చిహ్నం చేతిరుమాలన్నావు. మరి — రౌద్రం భీభత్సం భయానకం శృంగారం ఈ మొదలైనవాటికి ఏమి ట్రిక్కులు కనిపెట్టావు? ఈప్రధాన రసాల్ని ఆశ్రయించి వుండే క్రోధం రోషం, ఆశ నిరాశ, రోత మమత, రాగం విరాగం, ప్రశాంతం ఆవేగం, ఈ మొదలైన అనంతకోటివిభావాను భావాలకి ఏమి ట్రిక్కులు కనిపెట్టావు?

రామ. సరే, మధూ! ఏదైనా ఒక ఘట్టం నీముందు ఇప్పుడే యాక్టుచేసి చూపిస్తా. చూస్తావా మరి?

మాధ. ఇంతసేపూ చెప్పలేదేం? మహదానందంతో చూస్తా. అయితే, రామూ! ఇదివరలోఎప్పుడైనారంగస్థలమెక్కావా?

రామ. ఎక్కడికేం ! ఒకసారి నాలుగు రూపాయలు కిరాయి తీసుకుని— అంటే మన సామర్థ్యం వాళ్లకు శాంపిల్‌గా చూపిద్దా మనే ఉద్దేశంతో సుమా — ఒక పల్లెటూళ్ళో కన్యాశుల్కంలో గిరీశంపాత్ర ధరించాను. ప్రేక్షకుల కరతాళధ్వనులతో ఆకొట్టం తాటాకులన్నీ దద్దరిల్లిపోయి నయ్.

మాధ. చాలా సంతోషం. రామూ! ఆగిరీశం ఒక్కసారి యాక్టు చేసి చూపించు. ఏదీ? ఆ "ఏమివోయ్! మైడియర్ షేక్‌స్పియర్" ఒక్కింత అభినయించి చెయ్.

రామ. (కంగారు) ఆ వచనం — అరెరే — అంతా మరిచిపోయా సుమా.

మాధ. సరే. ఇప్పటి కిప్పుడు ఏదో వొక నవీనఘట్టం సృష్టించుకొని అభినయించెయ్. చూడు! ఒక అమాయికుడు— నిరపరాధి—సాధువు- హత్యానేరంకింద-ఆకస్మికంగా అరెష్టుచేయబడ్డాడు ఆ నిరపరాధివి నీవే అనుకో. ఏంచేస్తావు ? ఊఁ అభినయించు.

రామ. (తల గోక్కుంటూ) అది — మనకు — అంతగా ఎక్కదనుకుంటా.

మాధ. పోనీ. మరో ఘట్టం. ఒకడు మీ వూళ్లో ఇరవైయేళ్ల నుంచీ పెద్దమనిషిలాగ జీవనం చేస్తున్నాడు. ఒకనాటి రాత్రి దేవాలయంలో ప్రవేశించి దేవుడి మెడలో వున్న పచ్చల పతకాన్ని దొంగిలిస్తూవుండగా నీ కళ్ళారా చూచి వాణ్ణి పట్టుకున్నావు. ఆ పెద్దమనిషివి నీవే అనుకో. ఆఘట్టం అభినయించు. ఊఁ.

రామ. అటువంటివి కూడా — మనకు — అంతగా —

మాధ. పోనీ. కలకత్తా లాటరీలో ఒక టిక్కెట్టు కొన్నావు. ఆరునెలలు గడిచిపోయినయ్. అసంగతే మరిచిపోయావు. ఒకనాడు ఆకస్మికంగా లక్ష రూపాయలకి బాంకీ చెక్కు వచ్చింది. ఆ అదృష్టశాలివి నీవే అనుకో. ఆ ఘట్టం అభినయించు. ఊఁ.

రామ. అబ్బే! మన నాటకాల్లో ఇలాటి పిచ్చి ఘట్టాలు ఎందుకుంటయ్? ఏదో నలుడూ, హరిశ్చంద్రుడూ, దశరథుడూ, రాజరాజూ, సారంగధరుడూ ఇటువంటి ఉదాత్త నాయకుల సంగతి ఊహించాలి గాని, ఈ బాంకీ చెక్కులూ, ఈ ఖూనీలూ, ఈ వెధవ ఫారుక్లాస్ గత్తర్లూనా!

మాధ. ఓహో! పోనీ, నీ ఉదాత్త నాయకుణ్ణే ఒక్కసారి శాంపిల్ చూపించు. ఊఁ కానియ్!

రామ. అలా అడుగు మరి. హరిశ్చంద్రలో ఆ హరిశ్చంద్రుడు వల్లకాటి ఘట్టంలో కూర్చోని యేడ్చే పద్యాలు పాడి చూపించనా!

మాధ. నాకు కావలసింది పాట కాదు. అభినయం.

రామ. ఔను. పద్యాలు పాడుతూ అభినయం కూడా చేస్తా.

మాధ. పాడుతూ అభినయం చేస్తే పేజువాణీ అవుతుంది. నాటకం కాదు.

రామ. మరి,అందరు నటులూ ఇప్పుడు అదే పని చేస్తున్నారుగా!

మాధ. చెయ్యవచ్చు.

రామ. కలెక్షన్లూ వస్తున్నయ్.

మాధ. రావచ్చు.

రామ. ప్రేక్షకులు చప్పట్లు కొడుతున్నారు.

మాధ. రామూ! కలెక్షన్లనుబట్టీ కరతాళ ధ్వనులనుబట్టీ నాటక ప్రదర్శనాల విలువను నిర్ణయించడానికి పూనుకుంటే, అలాంటి కలెక్షనూ కరతాళ ధ్వనులూ సర్కసులకీ వస్తయ్. కోళ్ళ పందాలకి వస్తయ్. పశుప్రదర్శనాలకీ వస్తయ్. దీని కేమంటావ్?

రామ. అయితే నీ యభిప్రాయ మేమిటి?

మాధ. తర్వాత చెబుతా. ముందు ఏదో ఒక ఘట్టం - పద్యాలు లేకుండా సుమా - అభినయం చేసి చూపించు.

రామ. చూపిస్తే సహాయం చేస్తావా?

మాధ. అవశ్యం.

రామ. ఏ ఘట్టం చెయ్యమంటావు?

మాధ. నీ బుద్ధికి తోచిన - నీకు నచ్చిన - ఏ ఘట్టమైనా సరే.

రామ. (తీవ్రంగా ఆలోచించి) బలే. బలే. ఒక చిత్రమైన ఘట్టం స్ఫురించింది. చెప్తే నవ్వుతావేమో?

మాధ. నవ్వను చెప్పు.

రామ. ఇంటికి వచ్చి చూసేటప్పటికి భార్య కనపడలేదు. ఏమిటా అని విచారించగా, వీధిఅరుగుమీద పెట్టెదుకాణం పెట్టుకుని వుండే కుట్టు పనివాణ్ణి తీసుకుని లేచి పోయినట్లు తెలుసుకుంటాడు. ఆ ఘట్టంలో ఆ భర్త పొందే అవస్థను అభినయం చేస్తా.

మాధ. భేష్! భేష్! మంచి రసవత్తరమైన ఘట్టం. ఏదీ - కానియ్. నటేశా!

నటే. (ప్రవేశించి) యస్ మాస్టర్!

మాధ. బల్లా కుర్చీలు ఒకవైపుకు సర్దు. హార్మోనియం తబ్లాలు తీసుకుపోయి వారికి అప్పగించు. ఇక్కడ వాటితో పని లేదు. క్విక్ !

(బల్లా కుర్చీలు వెనక్కి సర్ది, తబ్లా హార్మోనీలతో నిష్క్రమణం నటేశం.)

రామ. (చేతికర్రా చెప్పులూ కోట్ స్టాండు దగ్గర విడిచి) నీ ముందు అభినయించడానికి చాలా భయంగా వుందోయ్.

మాధ. ఎంత మాత్రం వద్దు. రామూ! నీ కార్య సూరత్వానికి చాలా అభినందిస్తున్నా.

రామ. అదీగాక, వందలకొద్దీ ప్రేక్షకుల్ని చూస్తుంటే కలిగే ఉత్సాహం ఆవేశం ఒకే ప్రేక్షకుడి ముందు కలగదు.

మాధ. కొంత వరకూ సత్యమే.

రామ. అసలు సంగతి - ఆ కరతాళ ధ్వనులు లేక పోవడం మరీ బోసిగా కనిపిస్తున్నది.

మాధ. సందర్భానుసారంగా నేను కొడుతూ వుంటాలే.

రామ. (జేబులో నుండి సిగరెట్ హోల్డర్ తీసి ఒక సిగరెట్టు మాధవరావుకు ఇచ్చి ఒకటి తాను పట్టుకుని) నాకు అడ్డం రాకుండా నీవు దూరంగా ఆ సోఫాలో కూర్చో. ప్లీజ్! స్టేజీ అంతా కావాలి నాకు. (సిగరెట్టు వెలిగిస్తాడు.)

మాధ. ఎక్కడ కూర్చోమంటే అక్కడే కూర్చుంటా. (సిగరెట్టు వెలిగిస్తూ) కానీ, రామూ! ఒక్క సంగతి మరచి పోవద్దు. (పైమేడకేసి చూపిస్తూ) మాలతికి కొంచెం సుస్తీగా వుంది. బిగ్గరగా అరవవద్దు. (సోఫాలో కూర్చుంటాడు.)

రామ. (సిగరెట్టు పీలుస్తూ అభినయోద్రేకాన్ని తెచ్చు కుంటున్నాడు.)

మాధ. ఊఁ. ఇక ఆరంభం చెయ్. నాట్యాచార్యా! ఇదే ప్రేక్షకుల కరతాళ ధ్వనిపరంపర. ఆరంభం చెయ్. (చప్పట్లు కొడతాడు.)

రామ. (ప్రేక్షకుల వైపు తిరుగుతాడు. పగలంతా సంసారం కోసం కష్టించి కష్టించి అప్పుడే ఇంటికి వచ్చిన భర్తవలె మొహంపెడతాడు. రెండడుగులు ముందుకువేస్తాడు. ఎవరి కోసమో తెగ వెతుకుతున్నట్లు గదంతా కలయ చూస్తాడు. ఈ శాస్త్రి పాత్రను ధరించే నటుడు ఈ అభినయాన్ని గాని, ఇక ముందు చేయవలసిన అభినయాన్ని గాని, హాస్యంలోకి ఎంతమాత్రం దించకూడదు. శాస్త్రిమనస్ఫూర్తి గా నేఅభినయిస్తున్నాడు. ప్రేక్షకులకు మాత్రం అది వికా రంగాకనిపిస్తున్నది.) ఇందిరా! ఇందిరా!—ప్రాణేశ్వరీ!—

మాధ. (జనాంతికంగా) కటకటా! మారు పలుక వేల?

రామ. ఏది?—ఇచ్చట గానరాదేల?—చిత్రముగ నున్నది. (రిస్టువాచి కేసి చూచి) పదియు రెండు అర్ధరాత్రిము. ఇట్టి యపవేళ నెచ్చటికేగి యుండును? జీవితేశ్వరీ! ఇందిరా! ఇందూ!— హా! ఎచ్చట నున్నావు?

మాధ. (జనాంతికంగా) ఏ నెరుంగుదును.

రామ. (ఒక దారుణ అనుమానం ఆకస్మికంగా జ్ఞప్తికి వచ్చి నట్లు ఉలికిపడి) ఔను. ఔను. ఆ కుట్టు పనివాడు—ఛీ!- అసంభవము. నిష్కారణముగా ననుమానించు చున్నాను. నాయిందిర పతివ్రతా తిలకము. సీత, అనసూయ, అరుం ధతి, దమయంతి ఇత్యాది నారీమ తల్లుల పవిత్ర చరిత్ర

మ్మల నెన్ని సార్లో పఠించిన సంసారిణీ రత్నము. సావిత్రి నాటక ప్రదర్శనమును బడియు నాలుగు పర్యాయములు భక్తితో తిలకించిన పరమసాధ్వి. హరిశ్చంద్ర టాకీ చిత్రమును ఆరుసారులు సందర్శించిన నిత్య సత్యవ్రత. అట్టి నా అసూర్యంపశ్య! నా ప్రేమంపు బరిణె, నా చిలుకల కొలికి, నా మంద గమన, నా కుందరదన, నా బిరిబోడి, నా మగువ, నా అలన—

మాధ. (నవ్వును అతి ప్రయత్నంతో నిగ్రహించు కుంటూ) మిత్రమా! ఆగవోయ్ కొంచెం! ఆగు!

రామం (చాలా కోపంతో) ఎందు కాపావ్ నన్ను!

మాధ. నీ వచనరచన అంతగా నచ్చడంలేదు.

గామ. మధ్యమధ్య ఇలా ఆపేస్తుంటే యాక్టు చేసేవాడికి ఏం ఉత్సాహం ఏడుస్తుంది? ఛీ!ఛీ! నామూడ్ అంతా దగ్ధపటలం చేసేశావు.

మాధ. అయితే క్షమించు. ఇకనుంచి నేను పూర్తిగానిశ్శబ్దం. కానియ్.

రామ. (అమితప్రయాసతో వెనకటి స్థాయీభావాన్ని మళ్లీ నెమరు వేసుకుని) ఔరా! వీధి యరుగుపైనున్న పెట్టె దుకాణం బెక్కడ! అందలి యంగ్ టెయిలర్ — అనగా దర్జీయువకుం డెక్కడ? పవిత్రసంసారిణియగు తా నెక్కడ! నిజమగునా?_ఛీ! వట్టిభ్రమ! — కాని — ఉండు--- ఆనాటి విషయమొండు జ్ఞప్తికి వచ్చుచున్నయది. వాడు-లోనికి వచ్చెను. తాను — వాయిల్ సిల్కు నొసంగెను. వాడు "జంపరు కుట్టుదునా? లేక బాడీయా? రవికయా! ఫ్రాకా?" అనిప్రశ్నించెను. ఆమె "నాకు ఫ్రాకు బిగువు.

జంబరు వదులు. రవికె నాటు. బాడీబహిరంగము. కావున నో సాచివుడా! నీవే యూహించుకొని పనిచేయుము”

అని మందస్మితముతో ప్రత్యుత్తరం బొసగెను. అతడు కూడ మునిమునినవ్వులు నవ్వెను. అదియెల్ల నస్మదీయ నేత్రద్వంద్వముతో స్వయంబుగ వీక్షించితిని. మరి — ఆ నవ్వులోని యంతరార్ధ మేమైయుండును ? — హా ! హృదయమా! తొందరపడకుము. అనుమానమా ! పిశాచివై నన్ను వేధించకుము. ఓ భూమ్యాకాశములారా ! ఓ నదీ నదమ్ములారా! ఓ భల్లూక శార్దూల ఖడ్గ శరభ జంబూక మర్కట మార్జాలములారా !—

మాధ. (హృదయం దహించుకుపోతున్నది) అప్పు ! అప్పు నీ నాట్య ఛండాలం ! (సోఫానుంచి లేస్తాడు)

రామ. (తెల్లబోతూ) మాధూ ! నన్ను అవమానం చేస్తున్నావా?

మాధ. అవమానం ! నీకూకాదు — నాకూకాదు. దిక్కుమాలిన ఈ ఆంధ్రనాట్యకళకు ఈ అవమానమంతా. (కోపంతగ్గించు కుంటూ) మిత్రుడా! అభినయం ఆత్మహత్య అనే రెండిట్లో ఏదోఒకటి చెయ్యాకతప్పదు అని నీకు తోస్తే, ఆత్మహత్యనైనా చేసుకోగాని అభినయంజోలికిపోవద్దు, నాట్యకళను ఆశ్రయిస్తే ఆర్థికంగా లాభిస్తుందనే ఆశ వుండవచ్చు. కాని, జీవనోపాధికి ఎన్ని మార్గాలు లేవు? జ్యోతిషంచెప్పు. భూతవైద్యం చేయ్ సినిమాపత్రిక పెట్టి అడ్వర్టయిజ్మెంట్లు సంపాదించు. లేకపోతే సోడాషాపు కిళ్లీదుకాణం - ఆఖరికి తట్టలో పెట్టుకుని దంతకాష్ఠాలైనా అమ్ము. అంతేకాని నాట్యకళను నవ్వులపాలు చెయ్యొద్దు.

రామ. (రోషంతో)నీవు సాహాయ్యం చేస్తావనే ఆశతో వచ్చాగాని ఇలా ఫూల్ చేస్తావని అనుకోలేదు.

మాధ. నీ మనస్సు కష్టపెట్టా. తెలుసు. కాని—

రామ. అయితే, నా నాట్యం నీకు నచ్చనేలేదా?

మాధ. నీది నాట్యమే కానప్పుడు నచ్చుట నచ్చకుండుటఅనే వాక్భేదానికి తావే లేదు.

రామ. నాది నాట్యమేకాదా? మరేమిటి?

మాధ. నాగరీక భాగోతం. రామూ! అరదళానికి బదులు ఫేస్ పౌడర్, తుమ్మబంకకు బదులు స్పిరిట్ గమ్ము, సవరాలకు బదులు విగ్గులు, నూనె కాగడాలకు బదులు విద్యుద్దీపాలు, ఆకు పందిళ్లకు బదులు రేకులహాల్లు - ఇంతేభేదం. అయితే అసలు భాగోతానికి ఒక గురువూ ఒక నియమం ఒక పద్ధతి ఒకశిక్షణ ఒక సాంప్రదాయం ఉన్నాయ్. ఈభాగోతంలో ఎవడికి వాడే గురువు. ఇందులో, పద్యాలుపాడటమే అభినయసర్వస్వం. పద్యాల సంఖ్యనుబట్టే పాత్ర ప్రాధాన్యం. కిరాయి మొత్తాన్నిబట్టే నటకుని యౌన్నత్యం. 'అపూర్వ నట కాంబినేష'న్లను బట్టే నాటకానికి గౌరవం.

రామ. ఈ విమర్శ నాకేమీనచ్చలేదు. మాధూ! నాట్యకళలో ఇప్పుడు ఎన్ని ఇంప్రూవుమెంట్లు జరిగాయో గమనించకుండా విమర్శచేస్తున్నావు. మునుపు నాటకం ఆడాలంటే మా చెడ్డ గత్తరగా వుండేది. ఇప్పుడు ఏ బెజవాడ నుంచో తెనాలినుంచో ఏ కంట్రాక్టరో టకీ టకీ మని వైర్లూ టీ. యం. వోలు పంపిస్తే ఏ వూళ్లోనైనాసరే ఏ నాటకమైనా సరే నిమిషాల మీద ఆడి పారేస్తారు. ఈ ఆంధ్ర నాట్య కళోద్ధరణకోసం ఇంత శ్రద్ధతో నట నటీమణులూ కంట్రాక్టర్లూ నిద్రాహారాలు విసర్జించి, తిన్నవూళ్లోతినక, పండిన వూళ్లోపండక, రైల్వే కంపార్టుమెంట్లే శయ్యలుగా, ట్రావె

తింగు ట్రంకులే తలగడలుగా అష్టకష్టాలూ పడుతుంటే, నీవు వాళ్ల కళాదీక్షను- వాళ్ల కళా ఆవేశాన్ని—ఆవేళ మీకాదు, ఆ కళాదేవతను అమాంతంగా ప్రత్యక్షం చేసుకోడానికి ఆ భక్తులు చేస్తున్న ఆ కఠిన తపస్సును—

మాధ. (మేడగది కేసి చూపిస్తూ) దయచేసి, నెమ్మదిగా మాట్లాడు.

రాము. క్షమించు. మాధూ! అటువంటి నటమార్తాండులు, నాట్యాచార్యులూ—

మాధ. చాలించు నీ ఉపన్యాసం. ఏండ్ల కొలది కష్ట పడినా, జీవితాన్ని దానికే అంకితం చేసినా, లోతు తెలియని గంభీర, నిత్య నూతన, సర్వాంగ సుందరమైన ఈ నాట్య కళను చివరకు పద్యాల భాగవతాల్లకూ, కాపిటాలిస్టు కంట్రాక్టర్లకూ, అప్పగించి, ఇదే కళ అంటూ ప్రేక్షకులను మభ్యపెట్టి, అసహ్యపు అభి రుచులను వారికి అలవాటుపరచి, సంఘ కళ్యాణానికీ దేశ కళ్యాణానికీ ఉపకరింపవలసిన ఈ మహోజ్జ్వల సంస్థను పద్యాల పైల్వానులకు స్త్రీపట్లకు మల్లరంగంగా మార్చి, పాట పాడలేని అనేకమంది మహోత్తమ నటకులకు, కొత్తదనంకోసం యత్నించే అనేకమంది నవయువక నటులకు, రంగస్థలంలో అడుగు పెట్టటానికి కూడా ఆస్కారం లేకుండా చేసిన వీరట నటమార్తాండులట! నాట్యాచార్యులట! హాస్యాస్పదం!

రాము. మాధూ! (మేడకేసి ఈసారి తాను చూపిస్తూ) నాకు హెచ్చరిక చెప్పి నీవు మరిచి పోతున్నావు.

మాధ. (వినబడలేదు.) ఆంధ్రనాట్యకళయొక్క ఈదౌర్భాగ్య స్థితికి కళాభిమానియైన ప్రతి ఆంధ్రుడూ తల వంచుకోక

తప్పదు. నిలబడటానికి రెండు కాళ్లు వుంటే చాలు, మొహం మీద ముక్కూ కళ్లూ వుంటే చాలు, ఆ నిలక్షణ, విధేయ, శ్రవణదారుణ, జీవరహిత హార్మోనియంలో శృతి కలప గలిగితే చాలు, అగడు లోపింతా స్యుడు మొదలుకొని ధృతరాష్ట్రుడుదాకా, కంసుకి మొదలుకొని కాటి హరిశ్చంద్రుడిదాకా, ద్వారపాలుడు మొదలుకొని ద్వారకాధీశుడుదాకా వెయ్యి జాలని వేషం లేదు - ఇయ్యాని వానిదే తప్పు. అయ్యో నాబంగారు నాట్యకళా !—

రామ. (రోషంతో) కళ కళ అని ఊరికే ఏకరు పెడుతున్నావు మాఘా ! కళంటే నాకూ కొంచెం తెలుసు.

మాఘ. ఏమిటది ?

రామ. కళంటే అకో గమ్మత్తు - ఒక తంత్రం - ఒక తమాషా-

మాఘ. అయితే నీ సిద్ధాంతం తప్పక విన దగిందే.

రామ. హరిశ్చంద్ర నాటకం అనుకో. మనం చూస్తున్నామనుకో. హరిశ్చంద్రుడు వల్లకాట్లో కూర్చొని యేడుస్తున్నాడు. అయితే సామాన్య మానవుడిలాగ బావురు మని యేడవకుండా, చక్రవర్తిలాగా గంభీరంగా తాపీగా దిగ్గాగా తన కంఠాన్ని హార్మోనీలో ఐక్యం చేసి నాలుగో శృతిలో నాదనామక్రియతో "రాల్లరగించు విమల గాంధర్వంబు విద్య మాకు" అన్నట్లు కళా సాంప్రదాయ సహితంగా యేడ్చాడు. ఆ యేడ్పుకు గుండెలు నీరైపోయి నువ్వూ యేడ్చావు. నేనూ యేడ్చా. అంతా యేడ్చారు.

మాఘ. అందరూ యెందు కేడుస్తున్నారో అని పాలు తాగే పిల్లలు కూడా బావురు మన్నారు. దానితో కళకూడా

యేడ్చింది - "అయ్యో! అనవసరంగా ఈ చంటి బిడ్డల్ని యేడ్పించానే" అని -

రామ. నా ప్రశ్నకు సమాధానం చెప్పడానికి ఇష్టం లేక, ఎక్కాళికి దిగావు. నా ప్రశ్న యేమిటంటే, ప్రేక్షకుల్లో కలిగిన ఈ యేడ్పుకు - ఈరసానుభూతికి - నీ కళ ఏవిధంగా సాయ పడ్డది? మాధూ! కళా గాదు గిళా కాదు. నటనమూ కాదు అభినయమూ కాదు. ఆ హాలు, ఆ తెరలు, ఆ లైట్లు ఆ హార్మోనియం, ఆ నాదనామక్రియ, అన్నిటి కంటె ముఖ్యంగా - ఆవచ్చి కూర్చున్న ప్రేక్షకుల భ్రమ, వారి తన్మయత, వారి పారవశ్యం, ఇవి ముఖ్య కారణాలు. వీటిని తీసిపారెయ్ - నీ కళ వల్లా, నీ అభినయం వల్లా మూల నున్న ముసలమ్మకు కూడా చలనం కలగదు.

మాధ. రామూ! ఈ నాట్య కళను గూర్చిన కొన్ని అభిప్రాయాలు నీ బుద్ధిలో స్థిరపడి పోయినవి సుమా!

రామ. నీవు ఓడిపోయినట్లు ఒప్పుకుంటున్నావా?

మాధ. (నవ్వి) నేను ఓడినా గెల్చినా, కళను గురించి మనకు ఒక చర్చ జరిగింది. చర్చకు ఫలితంగా అనేక విషయాలు పరామర్శకు వచ్చినయ్. ఇదే పరమార్గం. రామూ! (మేడ గదికేసి చూపిస్తూ) బహుశా మన అరుపులకు లేచేవుంటుంది. వాట్ ఏ బ్రూట్ ఐ యామ్! డాక్టరు వచ్చాడో లేదో ఇంత వరకూ కనుక్కో లేదు.

రామ. మాధూ! నాట్యకళ పేరు చెబితే ఇల్లూవాకిలీ పెళ్లాం సంసారం ఏమీ పట్టవు నీకు. అటువంటి నీతో కాపరం చెయ్యడానికి ఆ మాలతీదేవి ఒక ఏంజిల్ అయిఉండాలి.

మాధ. నిజమే. కాని సహనం అంటే రాట్నపు దారం. మరీ లాగితే పుటుకున తెగిపోతుంది. ఆ భయం నాకెల్లప్పుడూ వుంది. రామూ! ఒక్కసారి పలకరించి యిప్పుడే వస్తా మళ్లీ. వెళ్లనా?

రామ. యస్. బట్ ప్లీజ్ కమ్ సూన్.

మాధ. ఏయ్! బోయ్!

నటే. (ప్రవేశించి) యస్. మాష్టర్!

మాధ. వీరికి కాఫీ దీసుకురా. (నిష్క్రమణం)

నటేశం నిష్క్రమణం

కూనరాగం తీస్తూ రామశాస్త్రి టేబుల్ మిర్రర్ లో తన్నుతాను చూచుకొని తలపాగా కోటుబొత్తాములూ కళ్లజోడూ వగైరాలు సర్దుకుంటాడు. తనకుతాను గుడ్ మార్నింగు కూడా చేసుకుని నవ్వుకుంటాడు. ఇంతలో నటేశం కాఫీతెచ్చి బల్లమీద పెట్టి వెళ్లిపోతాడు. త్వరలో వస్తానన్న మాధవరావు ఇంకా రాలేదేం అనుకుంటూ అప్పుడప్పుడు గుమ్మంకేసి చూస్తుంటాడు. బల్లముందు కూర్చొని కాఫి సేవిస్తుండంగా, గుమ్మం లోపలనుంచి ఏదో చప్పుడు వినిపిస్తుంది. ఉలికిపడి లేస్తాడు. గుమ్మందగ్గరికి వెళ్తాడు. వింటాడు. చప్పు డేమిటో అర్ధంకాలేదు. మళ్లీవచ్చి కాఫిసేవిస్తుంటాడు. గుమ్మంలోపలనుంచి ఈసారి మాధవరావు మూలుగు వినిపిస్తుంది. రామశాస్త్రి తిరిగి చూస్తాడు. మాధవ రావుకనపడటంలేదు. కాని, అతని చేతులువణికిపోతూ ఆ డోర్ కర్టెన్లను పట్టుకుని పుణుకు తున్నయ్. మెల్లగా ఆ

కర్టెన్నుతోసుకుంటూ మాధవరావు ప్రవేశం. మాధవరావు ఇందాకటి వ్యక్తిలాగ కనబడటం లేదు. అనిర్వచనీయమైనఒక దారుణ మనోబాధ ఆకస్మికంగా అతణ్ణి గ్రసించి కుమిల్చి తెమిల్చి కుంగదీస్తున్నట్లు ఆపాదమస్తకం కంపించి పోతున్నాడు. దేహం వంగి పోయింది. కళ్లు కల గంటున్నట్లు వున్నయ్. ఈ అయిదారునిమిషాల వ్యవధిలో అతడికి ఇరవైయేళ్ల వయస్సు గడచి పోయినట్లు కనిపిస్తున్నాడు. చేతిలో ఒకకవరూ ఉత్తరం ఉన్నయ్.

రామ. (మాధవరావును చూచి నిశ్చేష్టుడై పోయి, కొంత సేపటికి తెలివి తెచ్చుకుని) ఏమిటిది? — ఏంజరిగింది? — మాధూ! — మాధూ! ——

మాధ. (మాటలు అమిత కష్టంతో పెకలించుకొని వస్తున్నయ్.) మరేమీ లేదు. — ఆమె — (మేడగదికేసి చూపిస్తూ ఇక మాటచెప్పలేక అవస్థ పడతాడు.)

రామ. - ఆమె? - ఏమిటి?

మాధ. — గదిలో లేదు! - వెళ్లిపోయింది! -

రామ. వెళ్లిపోయిందా? - ఎక్కడికి? - ఎందుకు?-

మాధ. గదంతా వెతికా - ఈ ఉత్తరం - బల్లమీద - కనిపించింది, (ఉత్తరం తెరిచి చూస్తూ) అక్షరాలు అలుక్కుపోతున్నయ్ - చదవలేను.

రామ. (ఆమె లేచిపోయిందా అనే అనుమానంతో చకితుడౌతూ) అంటే - ఆమె నిన్ను విడిచి —— —— —— ఇంత దారుణం!- సంభవమా !

మాధ. (జవాబు చెప్పడానికి లజ్జించి తలవాల్చి కుప్పలాగ కుర్చీలో కూలబడి, కంపిత హస్తంతో ఉత్తరాన్ని శాస్త్రికి

అందిస్తూ) చదువు. ఏమి వ్రాసిందో చదువు. కొంతవరకే నేను చదివా. అప్పటికే అంధకారం కమ్ముకుంది.

రామ. (శాస్త్రి కూడా కంపిస్తున్నాడు. ఉత్తరాన్ని అందుకున్నాడు. చదవడం ఆరంభం చేశాడు. చదవడం సాగిన కొద్దీ ఉత్తరంలో విషయాలు తేట తెల్లమైనకొద్దీ అతడి గొంతు వెలుగు రాస్తుంది.) "నా ఒకప్పటి భర్త సర్. కె. మాధవరావు, ఎం. ఏ,పి. హెచ్. డి. ఎడింబరో గారికి. మీ ఒకప్పటి భార్య మాలతి వ్రాయు విశేషాలు. మహాశయా! ఈ ఉత్తరం మీరు చూచుకొనే లోపుగా నేను చాలా దూరం వెళ్లిపోయి వుంటాను. ఈవిధంగా తెగ తెంపులు చేసుకోడానికి ప్రబల కారణం వుంది."— ఉత్తరం చదువుతుండగా మాధవరావు పొందే అవస్థను ఆ పాత్రధారే ఊహించుకొని అభినయించాలి. ఇక మీదట గ్రంథకర్త చీటికి మాటికీ బ్రాకెట్లలో సూచనలు చెయ్యడం ఉత్తమ నటుణ్ణి అవమానించడమే అవుతుంది.

మాధ. కారణం?—కారణం?! ప్రతి నీచ కృత్యానికీ ఏదో వొక కారణం వుంటుంది.

రాము. "మిమ్మల్ని నేను మొట్టమొదట సారి రంగస్థలం మీద చూచాను. మీ నాట్య కౌశలానికి ముగ్ధురాలనయ్యాను. ప్రేమించాను. పెండ్లి చేసుకున్నాను. ఇది రెండేళ్ల క్రితం సంగతి. ఈ రెండేళ్ల నుంచే నా అనుభవం వల్ల తెలుసుకున్న పరమ రహస్యం ఏమిటంటే, నటుణ్ణి భర్తగా వరించడం కంటే నాపరాయిని మెడ గట్టుకోవడం నాణ్యమైన పని. అని"—

మాధ. అబద్ధం! అబద్ధం! నావల్ల తనకు అలాంటి అనుభవం ఎన్నడూ కలగ లేదు. లేదు.

రామ. "మీకు మీ నాట్య కళే ప్రపంచం. అదే స్వర్గం. అదే మోక్షం. ఆ ప్రపంచంలో మీ భార్యకు గాని, ప్రేమకు గాని, సంసారానికి గాని ఎక్కడా చోటు లేదు. మీకు రాత్రింతా నాటకంలో వేషం—నాకు రాత్రింతా ఇంట్లో నిద్ర. నాకు పగలంతా ఇంట్లో మెలకువ—మీకు పగలంతా ఇంట్లో నిద్ర. మీరూ నేనూ భార్యా భర్త లమై ఒక యింట్లోనే కాపరం చేస్తున్నా, ఫలితాన్ని బట్టి మీరు పూర్వార్ధ గోళంలోనూ - నేను పశ్చిమార్ధ గోళం లోనూ వున్నట్లే నాకు అనుభవ మైంది."

మాధ. కాదు. కాదు. ఇదే నిజమైతే, ఈ రెండేళ్లల్లో ఒక్క నాడైనా నాతో ఎందుకు చెప్పలేదు? వట్టిది. వట్టిది. తాను చేసిన సిగ్గుమాలిన పనికి ఇదో సాకు! పాపం!

రామ. "కాబట్టి మీకూ నాకూ నేటితో అన్ని సంబంధాలూ రద్దు. నేను ఇక నుండి ఆ ఫేమస్ షేక్స్పియరియన్ యాక్టరు మిస్టర్ కే. సి. చారి బి. ఏ. గారి స్వాధీనంలో ఉంటున్నాను.

మాధ. చారి? చారియా? - ఆ స్కౌండ్రల్!

రామ. "ఆయన మీకంటె గొప్పనటుడని నా అభిప్రాయం."

మాధ. ఓ డామ్ హిమ్?

రామ. మాధూ! ఈ ఆచారిగాడు నాకు తెలుసు. వట్టిరోగ్. ఏ రైల్లో చూసినా ఈ వెధవ మొహమే కాని టిక్కెట్టూ వుండదు - వాడి శ్రాద్ధమూ వుండదు.

మాధ. కిందటి సెల మద్రాసులో నా ప్రదర్శనమైన వెంటనే గ్రీన్ రూములోకి వచ్చి షేక్ హాండిచ్చి కల్లబొల్లి స్తుతు లన్నీ చేశాడు. డామ్ ది కట్ త్రోట్!

రామ. "ఒకవేళ, కోర్టు ద్వారా నన్ను రప్పించుకోడానికి యత్నం చేస్తారేమో, చేసినా మీకుసుఖం వుండదు. ఎందుకంటే, కట్టె మీదైనా మనస్సు మెట్టర్ చారిది. ఇట్లు మాలతి."

మాధ. సిగ్గుమాలిన వ్రాత! హృదయంలేని రంపె!-నేను నమ్మను! నమ్మను! మాలతి హృదయం నాకు బాగా తెలుసు. ఇది తనకు పుట్టిన బుద్ధికాదు. ఆ రాస్కెలే ఏ మెమో బోధించి వుంటాడు. ఔను. ఇప్పుడు అన్నీ జ్ఞాపకం వస్తున్నయ్. నేనులేని సమయంలో వాడు మూడు నాలుగు సార్లు ఇక్కడికి వచ్చినట్లు బాయ్ చెప్పాడు. ఓ డాగ్ ది డర్టీ డబుల్ ఫేస్డ్ విల్లన్!

రామ. మాధూ! నీ అవస్థ చూచి నాహృదయం నీరై పోతున్నది. మాలతీ యం. ఏ., అంటేఇంత కిరాతకృత్యం చేస్తుందని కాని, ఇంత శోకబాంబు ఉత్తరం రాస్తుందని కాని కలలో నైనా అనుకోలేదు. ఆమె మద్రాసులో చదువుతుండగా చాలా సార్లు చూశాను. మాట్లాడాను. ఎంత గుడ్ గరల్! ఎంత కల్చర్డ్ గరల్!—ఇప్పటికీ ఇదంతా నిజమా స్వప్నమా అని ఇంకా భ్రాంతి పడుతున్నా.

మాధ. స్వప్నం?!—మై గాడ్! స్వప్నం కాదు. కళ్లయెదుట పిశాచనృత్యం చేస్తున్న భయంకర సత్యం! (డోర్ కర్టెన వంకకుపోతు) ఈ పరిస్థితిని నా చేతులారా తెచ్చి పెట్టుకున్నా. ఇదంతా నాబుద్ధిజాడ్యానికిఫలితం. నేనో ఫూల్ని! ఇడియట్ని! (డోర్ కర్టెనలో మొహం దూర్చి ఒక్కసారి బావురుమంటాడు. తర్వాత మళ్ళీ ప్రేక్షకులవైపు తిరుగుతాడు. కళ్లల్లోనుంచి బొట బొట అశ్రువులు రాలుతూనే వున్నయ్) నేను నాట్యకళకి నాజీవితాన్ని అంకితంచేశాను.

నిజమే. కాని — నాట్యకళకంటే ఆనందమయమైన ఒక జీవకళను నా మాలతి నాకు చూపించింది. ఇక—ఇప్పుడు—నాకు బ్రతుకు — ఎడారి !—నిర్జీవం ! నిశ్శబ్దం ! (ఈ రసంలో నుంచి కొంత సేపటికి గభాలున స్థాయి మార్చి) ఔను. ఔను. నేను విడవను! విడవను! మాలతి నాది! నాది! ఆమెకోసం ప్రపంచమంతా గాలిస్తా! నాకు కనపడనియ్యకుండా ఏ స్కౌండ్రల్ ఎక్కడ దాచగలడో చూస్తా! లెట్ హిమ్ బివేర్ !

రామ. మధూ! ఆరాస్కెల్ ఇప్పుడు మద్రాసులో వున్నట్లు ఇటీవలనే విన్నాను. అక్కడ ఒక సినీమా డైరెక్టరుతో స్నేహం కలిపాడనీ, ఆ డైరెక్టరు తీసిందే ఒక బొమ్మ — — ఆడిందే మూడు రాత్రులు — గల్లంతైనవి రెండు లక్షలు అనిన్నీ, అరోగ్గా ఈరోగ్గా కలిసి ఇప్పుడు ఒక నాటు కోటి చెట్టియారుకు మాంచి బట్టర్-అంటే మన్నటివెన్న-పూస్తున్నారనీ సినిమాపత్రికలుకొన్ని చెవిలోచెబుతున్నయ్. కాబట్టి ఈమె మద్రాసే పోయివుంటుంది.

మాధ. మద్రాసులోనే కాదు- ఏడు సముద్రాలూ దాటిఅవతల వొడ్డున ఉన్నా నరే విడవను! విడవను!

రామ. ఉండు. ఒకఆలోచన. (రిష్టువాచీకేసి చూచి)తొమ్మిదికి అయిదునిముషాలు వుంది. ఆరేరే! సరిగ్గా గ్రాండ్ ట్రంకు ఎక్స్ప్రెస్ కు డిపార్చర్ టైము. ఇక నేం? దాన్లోనే వెళ్ళి వుంటుంది. మంచిది. మాధూ! నేనూవస్తానీతో. ఇద్దరంకలిసి గ్రాత్రిమెయిల్లో మద్రాసు వెడదాం. అక్కడ ఆ వెధవ ఏ గల్లీలో దాక్కున్నాపరే పట్టుకుని తన్ని, యీడ్చి అమాంతంగా కూమ్ నదిలో ఎత్తిపారేద్దాంఅలాంటిరాస్కెల్సుకు ఆరొచ్చులో స్నానము చేయించడమెఅర్హదండన.

మాధ. —పోందు పోలీసుస్టేషనుకు పోయి ఇన్‌ఫర్మేషన్ ఇస్తే బాగుంటుందేమో? —ఛీ! వద్దు. అవమానం. అపకీర్తి. భరించలేను!

రామ. కాని - వాళ్లకు చెప్పివుంచడం మంచిదని నాకుకూడా తోస్తున్నది.

మాధ. చెప్పక దీరదా? — ష్! ఎంత దరిద్రం! — సరే! నీవు వెళ్లి నరేశాన్ని కలుసుకొని డ్రైవరుతో చెప్పి నాకారు సిద్ధంచేయిస్తావా?

రామ. యస్. యస్.

మాధ. (శాస్త్రి చెయ్యి పట్టుకుని) రామూ! త్వరగా రా! నీవు లేకపోతే ఈ పాడుఇంట్లో క్షణమైనా వుండలేను.

రామ. డోంట్ వారీ మాధూ! ఇలారా, సోఫాలో కూర్చో. (కూర్చోపెట్టి, గుమ్మంవైపుకు పోతూ) ఏయ్‌బోయ్! బాయ్! డ్రైవర్ని పిలు!

అంటూ పోతుండగా, మాలతి అతనికి అడ్డంగా ఎదురుగా ప్రవేశించినట్టే తూనిలబడుతుంది. ఆమెమాలతా? మాలతి రూపంతో వచ్చిన దెయ్యమా? శాస్త్రి కొయ్యబారిపోతాడు. తర్వాత మెమ్మదిగా వెనక్కి అడుగులు వేస్తాడు. సోఫాలో కూర్చోపెట్టబడిన మాధవరావు ఇందాకటి నుంచి అలాగే తలవంచుకొని ఉన్నాడు.

రామ. (గొంతులో తడిలేక.) మాలతి! మాలతి! -మాధూ! మాధూ! మాలతి! —

ఇందాకటినుంచి తలవంచుకుని బాధతో మూలుగుతున్న మాధవరావు ఈ ఘట్టం జరుగుతున్న సమయంలో ఆ

మూలుగును క్రమంగా కూన రాగం లోకి దించి, పై సంభాషణ ముగిసేటప్పటికి ఫక్కున నవ్వి మొహం పైకెత్తుతాడు. మాలతి కూడా ఫక్కున నవ్వుతుంది. మాధవరావు లేచి మాలతివైపుకు వస్తాడు. మాలతిఅతడి వైపుకు వెళ్తుంటుంది. ఇద్దరూ కలిసి పెద్దపెట్టున నవ్వుతారు. శాస్త్రి ముఖవైఖరిలో నిజమైననటులక్షణాలు ఇప్పుడు తమంతట అవి తొణికిస లాడుతున్నాయ్.

మాల. శాస్త్రిగారూ! ఎలావుంది యీ నాటకం?

శాస్త్రి. (కుర్చీలో కూలబడి వగరుస్తూ) ఇంతసేపూ ఆడింది నాటకమా?!- మైగాడ్!

మాధ. రామూ! శక్తివంచన లేకుండా నీకోసం ప్రత్యేకంగా ఆడిచూపించాము. థాంక్ ఇజ్ ఓన్లీ యోర్స్!

మాల. శాస్త్రిగారూ! నాట్యమంటే లైట్లూ తెరలూ ఫేస్ పౌడర్ లిప్‌స్టిక్ స్పిరిట్ గమ్మూ, ముఖ్యంగా మీహారోర్థ సినిమా వాదనామ క్రియా ప్రేక్షకుల సభగా ఈ మొద లైనవే కాదనిన్నీ, వీటికంటే పరమశ్రేష్ఠమైన ఒక ఉజ్వలత ఒక చైతన్యం ఒక శక్తి నాట్య కళలో వుందనీ ఇప్పటికి మీకు బోధపడి వుంటుంది. నా మాధూ ప్రదర్శించిన నటనా కౌశల్యం ఎంతో అద్భుతంగా వుంది కాదూ?

రామ. అయితే-మాలతీదేవీ! ఇందాకటినుంచీ మీరు ఇంట్లోనే ఉన్నారా? మరి - మీకు సుస్తీగా వుందన్నారే? - ఇది కూడా మీ నాటకంలో ఒకఐటమా?

ల ఔనండీ. ఔను. మీరు ఇక్కడికి ఎందుకు రానున్నారో ముందుగానే ఊహించి, ఈ చిన్న ప్లాటు మీ కోసం వీరు తయారు చేసి పెట్టారు. నాట్య కళని గూర్చి

పరిషత్తుల్లో ఉపన్యాసాలు ఇవ్వడం కంటే చేతనైనంత వరకు చేసి చూపించడమే కర్తవ్య మని సిరి నిశ్చితాభి ప్రాయం.

రామ. కాని - మాలతీదేవి! మీవారు మీ కోసం ఇందాక గుండెలు పగిలి పోయేటట్లు యేడ్చారు. అది యెలా సాధ్య మైందో నాకేమీ బోధ పడటం లేదు.

మాధ. (సిగ రెట్టు వెలిగిస్తూ) రామూ! నటుడైన వాడి హృదయం ఎల్లప్పుడూ దర్పణాత్మమై వుండాలి అ దర్పణాన్ని ఏ పాత్రలో నింపుతాడో ఆ పాత్ర యొక్క ఆకార వికారాల్నే అది హత్తుకుంటుంది.

రామ. అయితే, మాధూ! మాలతీదేవి ఇంత సేపూ ఇంట్లో నే వున్నారన్న సంగతి యెలా మరిచి పోగలిగావు? మరిచి పోయినా ఈ కృత్రిమ వియోగ బాధను ఇంత ఆశ్చర్య కరంగా ఎలా అనుభవించ గలిగావు!

మాధ. నిజమైన నటుడికి రెండు జీవితాలు ఉంటాయ్. ఒకటి వ్యక్తిగతం - ఒకటి పాత్రగతం. ఈ రెంటినీ వేర్వేరుగా అనుభవించడమే నాట్య రహస్యం. రామూ! నా మాలతి నిజంగా అంత పని చేస్తే, ఈ రంగస్థలం ఎక్కి ఇంత తీరిగ్గా ఇలా పోర్షన్ అప్పగిస్తూ వుంటానా? అదైతే నిజం. ఇది నాటకం.

మాల (కొంటె నవ్వు నవ్వుతూ) శాస్త్రిగారూ! ఎప్పుడో ఒకనాడు అంత పనీ చేసి మీ స్నేహితుడి సత్తా పరీక్షించ వలెననే వుంది సుమండీ. ఎందు కంటే ఈ నటజాతి నమ్మ కూడని జాతి. రంగ స్థలంలో అరువు భార్యలను ప్రేమించి పతివ్రత్వం అనుభవించ గలిగిన ఈ వ్యక్తులు, ఇంట్లో నిజ

మైన భార్యల యెడల చూపించే ప్రేమ కూడా దొంగ నటన యెందుకు కాకూడదు? మాధూ! నేను అంత పనీ చేశాననుకో! అప్పుడు ఎలా నటిస్తావు?

మాధ. ఎలా నటిస్తానో చెప్పలేను గాని, ఎలా నటించనో అదిమాత్రం చెప్ప గలను.

మాల. సరే. అదే వినిపించు.

మాధ. (గభాలున పురాణ శైలిలో పద్యం పాడుతాడు)

ఆహా! మాలతి! యెందు బోయితివి! క
ట్టా! యిం కనే నెట్టు లీ
మోహాంభోనిధి గొట్టుకొందు నిక రా
వే! బ్రోవవే! కానవే!

అని మాత్రం నటించను.

రామ. మాధూ! మాలతీదేవీ! నా జీవితంలో ఇది చాలా సుదినం నాట్య కళ యొక్క నిజ స్వరూపాన్ని ఇవ్వాళ ప్రత్యక్షంగా చూశాను. నాటకంలో వేషం వెయ్యాలనే ఆయేసుకు తామరదురద నాకు ఇవ్వాళతో పూర్తిగా వదలి పోయింది కాని, పద్యాలు శరపరంపరగా పాడేసి ప్రేక్షకుల చెవుల్లో శంఖారావాలు పూరించి, వారి కరతాళ ధ్వనుల మధుర శబ్దం ఒక్క సారైనా వినకుండా చావమంటే అది నాకు అసాధ్య కార్యం. నా లోపం మీదగ్గర ఎందుకు దాచాలి? కాని, నా వ్యసనం తీర్చుకోడానికి మన పెద్దలు వీధి పురాణం అనే ఒక చక్కని సంస్థను నిర్మాణం చేసి వుంచారు కాబట్టి యీ నాట్య రంగం నుంచి నిష్క్రమణం చేసి, ఇక దేవాలయ అరుగు రంగం మీద ప్రవేశం చేస్తా. (ఈ సంభాషణ చేస్తూనే చెప్పులు

తొడుక్కుంటాడు. చేతికర్ర అందుకుంటాడు. గుమ్మంకేసి చూస్తూ) హలో! నాటలింగం? రంతూ! బయలుదేరండి! నాటకం క్లోజ్? (మాలతీ మాధవుల కేసి తిరిగి) గుడ్ మార్నింగ్ టు యూ బోత్! (వెళ్ళిపోతూ వుండగా)

మాల. }
మాధ. } —వెళ్ళవద్దు. భోజనం రెడీగా వుంది. ప్లీజ్!—

రామ. నో! నో! థాంక్ యూ! (నిష్క్రమణం)

మాల. (కొంటెతనంగా) మాధూ! ఇందాక నాకోసం ఎలా ఏడ్చావో చూడాలని చాలా అభిలాషగా వుంది. ప్లీజ్ వన్స్‌మోర్! (చప్పట్లు కొడుతుంది)

మాధ. నో మోర్ యూ నాటీ గరల్! కమాన్! ఏయ్ నటేశా! బోయ్! ఆకలి! ఆకలి!

మాలతిని చెయి పట్టుకుని లాక్కుపోతూవుండగా

తెర దిగుతుంది!

# అపహాస్యం (Satire)

మన సంఘ జీవితంలో అనుదినం కొత్త కొత్త బూటకాలు బయలు దేరుతూవుంటయ్. వాటిని ప్రతిఘటించడానికి అపహాస్యం అనే ఒక ఆయుధం మన చేతిలో లేకపోతే, అవి మనల్ని నిరంకుశంగా శాసించడం జరుగుతుంది.

ఏబూటకం మన అపహాస్యానికి గురి అయిందో, ఆబూడకం ఇకనుండి మనల్ని మోసం చెయ్యజాలదనుట నిర్ధారం. కాని, ఏబూటకాన్ని చూచి మనం నవ్వకుండా ఉన్నామో, ఆ బూటకం ఇంకా 'పూర్వాచారం' 'పెద్ద మనిషితరహా' 'సనాతన సాంప్రదాయం' అనే అరువుదుస్తులతో తన హేయ స్వరూపాన్ని మరుగుపెట్టుకుని మనల్ని మోసగిస్తూ వుందనుట నిశ్చయం.

అమూల్యప్రయోజనం కలిగిన ఇటువంటి అపహాస్యానికి ఏసంఘం తావియ్యదో ఆ సంఘంలో జీవించడం (విషక్రిమి న్యాయంగాతప్ప, మరో విధంగా) దుస్సహం. ఎందుకంటే అలాటి సంఘంలో డాంభికులూ వంచకులూ వేషధారులూ పండితం మన్యులూ నిరంకుశ విహారం చేస్తుంటారు.

మన హిందూ మనస్తత్వానికీ అపహాస్యానికీ చుక్కయెదురు. అందులోనూ మతాన్ని అపహాస్యం చెయ్యడమంటే మనకు అనాదినుంచీ గిట్టని వ్యవహారం. మన పెద్దలు అలాటివాళ్లను నాస్తికులనీ వ్రాత్యులనీ పాషండులనీ పేర్లు పెట్టి, వాళ్లను నామరూపాల్లేకుండా నాశనం చేశారు.

"ఎ బూటకమైనానసరే ప్రచారబలం చేత కొన్నాళ్లకు 'సత్యం'గా పాతుకుపోతుంది."—ఇదే హిట్లరు సిద్ధాంతం.

ఈసిద్ధాంతం మనపెద్దలకు ఇంకా బాగా తెలును. బూటకాల్ని ప్రచారంలో పెట్టడం వాటిని ఖండించే అపహాస్యాన్ని రాజ దండనకు అప్పగించడం, ఈరెండూ మన ఫాసిష్టు పెద్దలకీ హిట్లరుకూ సామాన్య పద్ధతులైనా, మన పెద్దలు హిట్లరుకంటే మరో మెట్టు ముందుకుపోయి 'యమదండ'నాన్ని కనిపెట్టారు. మన ప్రాచీన ఫాసిస్టుల్లో ఒకాయన సిద్ధాంతం వినండి!—

వేద దేవ ద్విజాతీనామ్
గురోర్నిందాచ యోఃకృతా
హరంతి తేషాం జిహ్వా
నారకే యమకింకరాః.

(మార్కండేయ పురాణం 14-44)

'వేదాల్నీ దేవతల్నీ బ్రహ్మ క్షత్ర వైశ్యుల్నీ గురువుల్నీ యెవరు నిందిస్తారో వాళ్ళజిహ్వాలను యమకింకరులు కోసి పారేస్తారు'. అయితే నిందవేరు విమర్శనవేరు అంటారేమో? ఆభేదంతా లౌకిక విషయాల్లోనే— మత విషయాల్లో విమర్శేనింద; నిందే విమర్శ.

'వేదాలు భగవంతుని సృష్టి అనుకోవడం వట్టి భ్రమ'— ఇది శుద్ధనింద.

పోనీ - 'ఇంటికి అతిథులు వస్తే ముఖ్యంగా గోమాంసంతో పిండివంటలు చేసి పెట్టాలి; అదే గొప్ప అతిథి సత్కారం అని వేదంలో చెప్పబడివుంది కదా—భగవంతుడు వేదకర్త అయితే ఇలాటి జీవహింసను, అందులో గోహింసను ఇంత పరమ పుణ్యకార్యంగా ప్రశంసిస్తాడా' అని శంకిస్తావేమో అదీ వేదనిందే. 'సరే. ఈక్షోభంతా నాకెందుకు? వేదాలు భగవంతుడు రాస్తేనాకేం? మాబడిపంతులు రాస్తే నాకేం!'

అని దులబరించుకుంటావేమో? అదీ వేదనిందే. 'సరే బుద్ధి వచ్చింది. ఇక వేదాల ఊసే నే నెత్తను.' అని లెంపలు వేసుకుంటావేమో అదీ వేదనిందే.

అపహాస్యాన్ని చూస్తే మతానికి అంత భయం యెందుకు? ఎందుకంటే మతానికి మూలం విశ్వాసం. విశ్వాసానికి విరుగుడు విమర్శ. విమర్శకు నవ్వునుకూడా జోడిస్తే అపహాస్యమై మరింత ప్రమాదం చేస్తుంది. ఇలాటి వాతావరణంలో పెరిగిన మన సంఘంలో ఎన్ని పాతబూటకాలు ఇప్పుడు ఎంత 'నిత్యనూతన సత్యా' లుగా చెలామణీ అవుతున్నాయో, వాటినిగూర్చి వ్రాయ బూనుకున్నవాడు, తాను భారత సాంఘిక చరిత్రను ఆద్యంతం వ్రాస్తున్నట్లు చివరికి తెలుసుకుంటాడు.

**రచయిత**

# రంగసామగ్రి

ఈ నాటికను సులభ సూత్రంగా ప్రదర్శించడానికి
కొన్ని సూచనలు:—

1 మొండి గోడ—ఎత్తూ పొడుగూ వెడల్పూ ఉన్న జాజి చెక్కల పెట్టెకు కాగితాలు అంటించి రంగు పూస్తే సరిపోతుంది.

2 మొండి స్తంభం—ఇనప (లేక కర్ర) పీపాకు కాగితాలు అంటించి రంగు పూసి గోడ మీద నిలబెడితే సరిపోతుంది.

3 వెనక తెర—పట్టె నీలాకాశం. లేత నీలం రంగు గల ఏ గుడ్డను కట్టినా సరి పోతుంది.

## నాటక సామగ్రి

భిక్షువుకు జోలీ సొరకాయబుర్రా.
జోలిలో గోచిపాత, తాటాకుల గ్రంథం, అరటిపళ్లు.
సొరకాయ బుర్రలో నీళ్లు.
మాయకు మొహరీల పట్టు పంచి.
రాజకుమారుడికి మరొక మొహరీల పంచి.

## పా త్ర లు

ఒక బౌద్ధ భిక్షువు

ఒక దేశ దిమ్మరి

రాజ కుమారుడు - నలాందా పాలకుడు

మాయ - ఒక పూజారిణి

ప్రదేశం—నలాందా శిధిలాలు

గమనిక—ఈ నాటికలో వచ్చే పాత్రల వేష ధారణం అజంతా శిల్పాన్ని అనుకరించాలి.

## సూచన

ఈ నాటికలో స్వగతాలు గాని జనాంతికాలు గాని లేవు. బ్రాకెట్లలో వ్రాయబడినవన్నీ రచయిత సూచనలూ, రచయిత ఊహాపోహాలు.

ప్రదేశం—నలాంద శిథిలాలు

నలాందా శిథిలాల్లో ఒక పడిపోయినగోడ. ఆగోడలో సగంవిరిగిన ఒక స్తంభం. బౌద్ధభిక్షువు ఆ పడిపోయిన గోడమీదకూర్చొని ఆ స్తంభశేషానికి వీపుఆనించి ఏదో ధ్యానంలోవున్న సమయంలో మాయ నిశ్శబ్దంగా ప్రవేశించి మోకరించి అంజలి నిబద్ధయై తిలపంచుకుంటుంది. దూరంగా పిల్లంగోడు గానం వినిపిస్తూ వుంది. కొంత సేపటికి భిక్షువు కలవరంతో లేస్తాడు - వింటాడు - చూస్తాడు.

భిక్షు. మళ్లీ వచ్చావా నన్ను పీడించటానికి? —ముందు ఆ గానం ఆపించు.

మాయ. (గానం వినిపిస్తున్న వైపుకు చేతితో సైగ చేస్తుంది. గానం ఆగిపోతుంది.) ఇందాక చాలావిసుగుతో ఉన్నావు. ఈసారైనా ప్రసన్నుడవౌతావేమో అని ఆశతోవచ్చాను. తథాగతా!

భిక్షు. తథాగతుడూ లేడు,-యథాగతుడూ! లేడు! పో

మాయ. నీవు భగవంతుడ వనీ, మా తొమ్మిదో అవతారమైన బుద్ధుడవనీ -

భిక్షు. ఆగు!— నేను బుద్ధుణ్ణా? అదిచాలక భగవంతుణ్ణా! ఎవరు చెప్పారు నీకు?

మాయ. లోకమంతా చెటుతూవుంది.

భిక్షు. చెప్పుకోనియ్. నేను బుద్ధుణ్ణీకాదు-భగవంతుణ్ణీకాదు. దారిని పొయ్యే బికారుల్లో వొకణ్ణి. తెలిసిందా? ఇకపో!

మాయ. సిద్ధార్థా! భగవంతుడు తన నిజ వృత్తాంతాన్ని నిజమైన భక్తులకు తప్ప ఇతరులకు చెప్పడనీ—

భిక్షు. ఆగు! నే నున్న ఈ ప్రదేశం పేరు ఏమిటి?

మాయ. ఇది వొకప్పుడు విశ్వ విఖ్యాత మైన నలాందా బౌద్ధ విహారం. ఇప్పుడు దారుణ శిథిలా వస్థలో వుంది. కాని సర్వజ్ఞా! ఆగతా నాగత వేది వైన నీవు ఏమీ తెలియనట్లు నన్ను ప్రశ్నలు వేస్తున్నావు. ఇదికూడా భగవంతుడి లీలా వినోదాల్లో వొకటా? !

భిక్షు. ఈ నలాందా శిథిలాలు ఎందాకా విస్తరించి వున్నయ్యో చెప్పగలవా?

మాయ. కొంచెం హెచ్చు తగ్గుగా నాలుగు కోసుల దాకా.

భిక్షు. (లేచి జోలిసర్దుకుంటూ) అయితే, ఈ గాఢాంధకారం కూడా నాలుగు కోసుల దాకా విస్తరించి వుంటుంది. సాయంత్రానికైనా దాటగలిగితే ధన్యుణ్ణి—

మాయ. సుగతా! నన్ను తప్పించుకు పోవా లనుకుంటున్నావు. నేచేసిన నేరం ఏమిటి?

భిక్షు. నేరం? యువతీ! 'తథాగతా' అనీ 'సిద్ధార్థా' అనీ సంబోధించి ఎర్రగా కాచిన సీసాన్ని నా చెవుల్లో చుక్క చుక్కగా నిక్షేపించడానికి నే చేసిన నేరం ఏమిటో చెప్తావా?

మాయ. నన్ను పరీక్ష చేస్తున్నావా! పోనీ. భగవన్! నేను వచ్చిన పని సఫలం చేసి నన్ను పంపివెయ్,

భిక్షు. సరే. ఏమిటా పని? (మళ్లీ కూర్చుంటాడు)

మాయ. (తలవంచుకుని) సుగతా! నేను ఒక దారుణ పాపం చేశాను.

భిక్షు. (ఆవలిస్తూ) నీవంటి పడుచులకు అది అసామాన్య విషయం కాదు.

మాయ. చేసిన పాపం చెప్పుకుని పాప పరిహారం పొందాలని వచ్చాను.

భిక్షు. ఎక్కడ నేర్చుకున్నావు ఈ నీతిరాజం?

మాయ. "యదాత్రాత్ కురుతే పాపమ్, తదాత్రాత్ ప్రతిముచ్యతే" అంటూ విన దినం నా భర్తగారు సంధ్య వారుస్తుండగా వింటూ వుంటాను.

భిక్షు. ఓహో? నీకు ఒక భర్త ఉన్నాడా? అందు వల్లనే పాపంచేసి వుంటావు.

మాయ. నేను మనస్ఫూర్తిగా చేసిన పాపం కాదది ఆ పర పురుషుని ఉదంతం మొట మొదట నాకు ఏమీ తెలియదు. ఆయన—

భిక్షు. వర్ణనలు వద్దు. సంగ్రహంగా చెప్పు.

మాయ. ఆపురుషుడు ఒక మహాక్షాత్ర తేజస్వి-సుకుమార సుందరుడు. నేనో ఒంటరిదాన్ని. సమయమా రాకాచంద్ర చంద్రికా పులకితం. ప్రదేశమా మనోహర సురభినిశ్వసిత మైన వకుళోద్యానం. అతడు మెల్లగా నావద్ద చేరి చెవిలో "మాయా? జగదేక సుందరీ! ప్రియే!"—

భిక్షు. ఆగు! ఆ కలుష భాషను మావద్ద ఏకరు పెట్టవద్దు.

మాయ. క్షమించు తథాగతా!—

భిక్షు. కాబట్టి నీ అనంతర కథా భాగం సులభ గ్రాహ్యం.
మాయ. ఔను సర్వజ్ఞా!
భిక్షు. సరే. ఇక పో.

మాయ. ఆపాపం నుంచి నాకు విమోచనం అనుగ్రహించావా?

భిక్షు. ఆ విషయం నాకు తెలియదు.

మాయ. ఆ పాపానికి నేను పొందిన పశ్చాత్తాపం ఎంతో నా హృదయ సాక్షికి తెలుసు. సర్వసాక్షి వైన నీకు తెలుసు.

భిక్షు. నాకు ఏమీ తెలియదు. పో యిక!

మాయ. తథాగతా! నీ ఉపదేశ సుధా రసాన్ని కొంచెమైనా చెవులార తాగకుండా—

భిక్షు. అవు నీ కవితా ధార! పో! పోయి, పాపం అని నీకు తోచిన కార్యాన్ని ఇక మీద చెయ్యకు.

మాయ. సుభాషితం. సుభాషితం.

వయ్యారంగా లేస్తుంది. మాహిరీలువున్న ఒకపట్టు జల్తారు సంచిని తన కంచుకం నుంచి బయటికి తీస్తూ

మాయ. తథాగతా! ఏ కానుక నీకు తృప్తి ఘటిస్తుందో నాకు తెలియదు. అయినా—

భిక్షు. కానుక!—లంచానికి ఎంత చక్కటి పేరు!

మాయ. సర్వజ్ఞా? భగవంతుడికి యథాశక్తి కానుక లివ్వడం భక్తుల ధర్మం కదా.

భిక్షు. నీ ధర్మ గీతాలాపం చాలించి యిక పో!

మాయ. తథాగతా! నీకు తెలియని విషయాలు ఉండవు. పూరీక్షేత్రంలో జగన్నాథస్వామికి ఏటేటా భక్తులు

చెల్లించే మొక్కుబళ్లు మూడు లక్షల వరహాలకు తక్కువ ఉండవు. అతడో సామాన్యదైవం. నీవో త్రామ్మిదో అవతారం. కాబట్టి నేను చెల్లించుకునే కానుక చాలా స్వల్పం అని తెలిసికూడా—

భిక్షు. ఆపు నీ వాచాలత. నీ క్షుద్రకాంచనంతో నాకు పని లేదు.

మాయ. (ఉబ్బిస్తే పుచ్చుకుంటాడేమో?) సిద్ధార్థా! ఈ ధనం నీ చేతుల్లో చాలా సద్వినియోగం పొందగలదని నా విశ్వాసం. ఏ విహారమో, స్తూపమో, తటాకమో, సత్రమో-

భిక్షు. యువతీ! నీ పొగడ్తల కుబ్బి నీ విచ్చే లంచాలు తీసుకునే దేవుళ్లు చాలామంది ఉన్నట్లున్నారు. వారివద్దకే పోయి నీ అభీష్టం నెరవేర్చుకో. పో! నన్ను మాత్రం బాధించకు.

మాయ. భగవన్! మీకు నావల్ల అంత బాధగా వుందా?

భిక్షు. బాధ? ! 'తథాగతా' 'సిద్ధార్థా' 'సర్వజ్ఞా' అను నీ బట్టు పొగడ్తలతో నా చెవుల్నీ, అత్తరు గమగమల వెదజల్లుతూన్న నీ పైటచెరగుతో నాఘ్రాణాన్ని, బంగారు నాణ్యాల మిలమిలలతో ప్రతిఫలిస్తున్న ఆ సంచితో నా కన్నుల్నీ దారుణదారుణంగా హింసిస్తూ బాధ యేమని ఇంకా అడుగుతున్నావా? నారీ! పో! పో! నీ జగన్నాథుడిదగ్గరకు పో! లేక మరేనాథుడివద్దకైనా పో!

మాయ. (ఘాటుగా తగిలినయ్. అయినా భక్తులకు ఇవో లెక్కా?) సర్వజ్ఞా? జగన్నాథ క్షేత్రం ఇక్కడికి చాలా దూరం. అందుచేత వ్యయ మధికం - ప్రయాస మెండు.

భిక్షు. కాబట్టే నన్ను పట్టుకున్నావు.

మాయ. కాదు. నీ మహిమను ఎందరో చెప్పుకోగా వినివిని నీ దర్శనానికై పరితపించి వచ్చాను. (చిరునవ్వు తొలకరిస్తూన్న పెదవులతో) భగవన్! అదే ఆవతుళ్లో ద్యానంలో ఆ కాళీగుడిని అనివున్న సౌధమే నాది. నా పేరు మాయాదేవి. నా భర్త ఆగుడి పూజారి. వస్తుసంభార సంగ్రహణార్థం ఆయన ప్రతిరోజూ పాటలీపుత్రం వెడుతూ వుంటాడు. ఆయన లేని సమయంలో నేను తమ సన్నిధికి వస్తూ పోతూ (అంటూ భిక్షు భుజంమీద చనువుగా వేలు పెడుతుంది).

భిక్షు. (విసిరి కొట్టి) పో శాకినీ! పో ఢాకినీ! పోతావా లేక నేనే పోవలెనా? (చివాలున లేస్తాడు)

మాయ. సరే. భగవన్! మీకు మనశ్శాంతి కుదిరి నపుడే మళ్లీ దర్శనం చేసుకుంటా. సెలవు. (అంటూ భిక్షువుకు తెలియకుండా మొహరీల సంచిని గోడమూల జారవిడిచి వయ్యారంగా నమస్కారంచేసి కులుకునడలతో వెళ్లి పోతుంది.)

భిక్షు. (కూర్చుంటూ) ఈ భక్తులకు మెదడు ఊసర క్షేత్రం—చర్మం మందం. అబ్బబ్బ! ఒక్క స్త్రీతో ఇంత బాధ పడ్డానే? ఓ జగన్నాథా! నీవు పాషాణివి కాబట్టి బ్రతికి పోయావు. లేకపోతే ఈ భక్తజనం నిన్ను ఏకాహుతిగా భక్షించి వుండేది. (జోలి అందుకుని, ఒక అరటిపండు తీసి తింటూ వుంటాడు.

అప్పుడు కూనరాగం తీసుకుంటూ దేశదిమ్మరి ప్రవేశం.

దిమ్మ. (భిక్షువును హఠాత్తుగా చూసి) ఏమిటీ వేషధారణం? భాయీ! ఎవరండీ మనం? నమస్తే! నమస్తే!

భిక్షు. నమస్తే!

దిమ్మ. (స్నేహం కలిపేస్తున్నాడు) చూడు భాయీ! ఇవ్వాళ అంతగా యెండాలేదు; వడగాడ్పూలేదు. మాంచి హాయిగా వుంది సుమా.

భిక్షు. ఏ ప్రాంతం నుంచి నీ రాక?

దిమ్మ. నేనా? ప్రపంచంలోకల్లా బ్రహ్మాండ మైన పట్నం యేదో అక్కణ్ణుంచి వస్తున్నా. (ఛాతీ విరుస్తూ) దాని పేరు కాశీ - మహాకాశీ - వారణాసీ - మణికర్ణిక - హరి శ్చంద్ర ఘాట్?

భిక్షు. ఓహో! యాత్రికుడవా నీవు!

దిమ్మ. (చక్కటి ఊహే!) ఔను. ఔను. యాత్రికుణ్ణి. మరి-గురూజీ! మన జోలిలో ఏమైనా తినుబండారాలున్నయ్యా!

భిక్షు. (జోలిలో చెయి పెట్టి) అరిటి పళ్లున్నయ్. (రెండు పళ్ళు యిస్తాడు.)

దిమ్మ. పాపం - నీకో?

భిక్షు. ఇంకా ఉన్నయ్.

దిమ్మ. అన్నదాతా! సుఖీభవ! (వొలిచి ఆత్రంతో తింటాడు)

భిక్షు. నీది దిగులు లేని బ్రతుకు.

దిమ్మ. నీకు దిగుళ్లున్నయ్యా యేమిటి భాయీ!

భిక్షు. (మౌనం)

దిమ్మ. ప్లోష్! ఎటువంటి చల్లటి రోజు ఇవ్వాళ్ల! ఎంత మనోహరంగా వుంది?

భిక్షు. అల్లదిగో! ఆ గుడి వంక పోయే దారి మీద దృష్టి సారించి చూడు! నా శోక హేతు వొకటి కాళ్లతో నడచి పోతూ వుంది.

దిమ్మ. (అటు చూస్తూ) ఎవరు? - ఒహో! స్త్రీ అనుకుంటా! కాదు - లొట్టిపిట్టేమో! - కాదు. కాదు. స్త్రీయే.

భిక్షు. అందుకనే నా బాధ.

దిమ్మ. (ఇందులో ఏదో కథ ఉందన్న మాటే! కన్ను గీటుతూ) అయితే - భాయీ! మనకీ ఆ స్త్రీకి ఏమిటి సంబంధం? ఆత్మ పరమాత్మ సంబంధమా? హాహాహా!

భిక్షు. సోదరా! వెలత వల్ల సుఖాన్ని అపేక్షించడం, నీళ్లు లేని బావిలో చేద వెయ్యడం సుమా!

దిమ్మ. హి హి హి! వేదాంతం! హి హి హి! (నవ్వుతూ వుండగా గోడమూల పడి వున్న సంచి కంట పడుతుంది) బలే! బలే! భాయీ! ఇవ్వాళ మన రొట్టె నిజంగా నేతిలో పడ్డది. జై! గంగామాయికీ జై! (ఆసంచిని అందు కుంటాడు)

భిక్షు. ఆ యువతి ఎంత గడుసరి! ఆ పాప సంచితాన్ని ఇక్కడ జార విడిచి పోయిందా!

దిమ్మ. ఓహో! ఆమహానుభావురాలిదా యీ సంచి? (వాసన గుమ గుమ) ఆహాహా! ఎంత సుఖంగా వుంది ఈపరిమళం?

భిక్షు. భ్రష్టుడా! నీ ఆత్మ నైర్మల్యాన్ని కాపాడుకోవా లంటే దాన్ని దూరంగా పారవెయ్.

దిమ్మ. ఒహో! నేను పారేస్తే నువ్వు తీసుకో వచ్చు ననా ఉపాయం?

భిక్షు. బుద్ధిహీనుడా! ఆ సొత్తు నీదీ కాదు - నాదీ కాదు - ఆ యువతిది.

దిమ్మ. కొంపతీసి ఆమె మళ్లీవస్తే దీన్ని ఇచ్చెయ్య మనవుకదా?

భిక్షు. మరి? దానిని నావద్ద నుంచుకొని నా అంతరాత్మను శాశ్వతంగా కలుషం చేసుకో మంటావా?

దిమ్మ. వద్దులే. నీ బదులు ఆ అంతరాత్మ బాధంతా నేనే పడతా! (సంచి విప్పి చూస్తాడు. బంగారు నాణ్యాలు కనిపిస్తయ్. కదిలిస్తాడు. శ్రీవణానందం. పళ్ళికిలిస్తూ భిక్షువుకేసి చూస్తాడు.)

భిక్షు (చాలా కోతతో) ఛీ! భ్రష్టా! పో! మార్గంగా పో! పుణ్య క్షేత్ర సమీక్షా కుతూహలుడవగు యాత్రికుడ నంటివే! అబద్ధం! యాత్రికుడవు కావు. గజ దొంగవు. కలి బిడ్డవు. కాంచెన దాసుడవు.

దిమ్మ ఏమిటీ ఛాందసం?

భిక్షు. పో! నా సన్నిధినుంచిపో! ఊఁ!

దిమ్మ. అదికాదు భాయీ! అంత కంగారు పడతావెందుకూ అంట? చూడు! మన స్నేహం ఇప్పుడిప్పుడే గంగాయమున ల్లాగా కలిసిపోతూ అంది. స్నేహధర్మమంటే ఎంతపవిత్రం! ఎంత అమూల్యం!—

భిక్షు. (చివాలున లేచి) పాపీ! నీవు పోకపోతే నేనే పోవక తప్పదు. అంతరాత్మ అనేది నీకువుంటే, దానికి నీవే సమాధానంచెప్పుకో! (గోడ దిగి అదే పాటున నిష్క్రమణం.)

దిమ్మ. (భిక్షువుకేసి చూస్తూ పకపక నవ్వుకుంటాడు. అనంతరం-భిక్షువు కూర్చున్నచోటు మీదికి దృష్టి మరలుతుంది.) కూర్చోడానికి మొండిగోడ, ఆనుకోడానికి స్తంభం. బలే! ఇదీఒక కొత్త అనుభవమే! కాని, కూర్చొని చూద్దాం... (ఎక్కుతాడు. సరిగ్గా ఆ భిక్షువు కూర్చున్న చోటులో

అతడిలాగే తిష్టవేస్తాడు. చేతిలోని మొహిరీల సంచిని గబగబామళ్లీకదిలిస్తాడు. ఎంతమధురంగా వుందిఆనాదం! మునిమునిసవ్వులు నవ్వుతూ) పిచ్చుకలండీ! బంగారు పిచ్చుకలు! (ఒక్కొక్క పిచ్చుకనే గూటినుండి లాగుతూ) ఒకటి-రెండు - మూడు - నాలుగు. (సంచి దులుపుతాడు) నాలుగేనా?! కానియ్! తృప్తి కంటే పరమరహస్యం లేదని శాస్త్రకారుడు చెప్పాడు (ఆనాలుగుజేబులో వేసుకున్నాడు. బ్రహ్మానందం ) కాని, ఇప్పుడా మనకు చచ్చేటంత దాహం అవుతున్నది. ఏమిటుపాయం?......బలే! ఆ భిక్షువు తన జోలి సొరకాయబుర్రా ఇక్కడే దిగబెట్టివెళ్ళాడు. ఇంకేం (దిగి బుర్రనుఅందుకుంటాడు. కదిపిచూస్తాడు. లోటలోట. ఆనందం. బుర్రయెత్తి నోట్లోకి ధారనుపంపుతాడు. తృప్తి ఇకజోలినిపరామర్శిస్తాడు ) బైరాగుల జోలిలో గంజాయి చిలుముగాక మరేముంటుంది? అయినా చూద్దాం. (గోచీ వస్తుంది.) ఛీ ఛీ! (పారేస్తాడు. ఈసారి తాటాకులగ్రంథం వస్తుంది.) ఒహో! ఇదేదో వేదాంత సరుకు కాబోలు? (సంచిలో మరేమీ కనబడవు.) కానీ పెద్దమనిషి లాగా కాసేపు గ్రంథావలోకనం చేద్దాం. సరిగ్గా ఆ భిక్షువు స్థానంలో అతడిలాగే కూర్చొని గ్రంథావలోకనం చేస్తూ వుంటాడు.

కొంతసేపటికి రాజకుమారుడు నిశ్శబ్దంగా ప్రవేశం. అరడుగుల పొడవు-ఆపాదమస్తకం మెలిపట్టు ముసుగు-ముఖంమాత్రమే కనిపిస్తున్నది - క్షాత్రతేజస్సు. దిమ్మరి అతణ్ణి చూడలేదు. ఎందుకంటే, తన వెనుకనుండి అతడి ప్రవేశం. ఆ రాజకుమారుడు దిమ్మరి వెనకనే నిలబడి అతడి వీపుపై తన భక్తి వీక్షణాలతో అభిషేకిస్తూ.

రాజ. వం—దే!

దిమ్మ. (ఉలికిపడి) ఎవరు?

రాజ. (నమస్కరిస్తూ) తమ యేకాగ్రతకు భంగ మొనర్చితిని కాబోలు భగవన్!

దిమ్మ. (భగవన్ ఏమిటి) నాయేకాగ్రతకా! భంగమా? ఓష్! ఇంతమాత్రానికేనా? పిడుగులు పడితే అనుకోవలసినమాట అది.

రాజ. మరి — ఈ దీనుని సొద నొక్కింత యాలింతురా!

దిమ్మ. సొద! పోష్! మగపురుషుడికి సొద యేమిటి!

రాజ. భగవన్! నీ సంభాషణలు నీ ప్రశ్నలు నీ లీలలు మిగుల దురవగాహములని పెక్కురు చెప్పగా వింటిని.

దిమ్మ. (అభిక్షువే తానని ఈతడు భ్రమ పడుతున్నట్లు గ్రహించాడు. బలేసుట్టం! కానీ-మళ్ళీ లభిస్తుందేమో పిచ్చుకలవేట) అయితే-నన్ను గూర్చి ప్రజలంతా యేమను కుంటున్నారు?

రాజ సర్వజ్ఞా! నీ వెరుంగని విషయము లుండునా? ఈ కలిమానవులను తరింపజేయుటకై ఈవలాంఛనాధిత ములలో ఈబికారి వేషమున ఆ బుద్ధపరమాత్ముడే యవతరించెనని లోకమెల్ల ఏకగ్రీవముగా వాకొనుచున్నది.

దిమ్మ. బలే! బలే! మీ మానవులు ఇంత కుశాగ్రబుద్ధులా?

రాజ. భగవన్! చినికి చిరిగిపోయిన నీ చేలము, దానిపై దట్టముగ నంటుకొని యున్న దేశదేశముల మార్గధూళి, నీవు సిద్ధార్థుడవని చెప్పక చెప్పచున్నని.

దిమ్మ. అబ్బెబ్బే! అంత వికారంగా వుందా మనపాలకం!

రాజ. తథాగతా! భక్తులను కఠినపరీక్ష సేయుచుందువ, నీవు సుప్రసన్నుడవు కావని లోక మెరుంగును. పెక్కు తెరంగుల నన్నుకూడ పరీక్ష సేయుదువని యెరింగియే వచ్చితిని.

దిమ్మ. కాని, (దగ్గుతూ) నాపరీక్షకు నీవు పూర్తిగా నిలబడావు సుమా.

రాజ. సుగతా! యుక్తాయుక్త వివేచన నాకు వెన్నతో బెట్టిన సుగుణము. నన్ను భ్రమింపజేయుటకు ఎందరెందరో నీవలెనే యత్నించి విఫలురైరి. భగవన్! వేయి మాటలేల? నిన్ను చూచిన నాతొలి చూపునందే నీవుసర్వార్థసిద్ధుడవని మాటిక గ్రహించితిని.

దిమ్మ. (పొంగివస్తున్న నవ్వును దబాయించుకుంటూ) అంత సులభంగా గ్రహించావా? అయితే, నావీపులో కూడా ఏదో మహత్తు ఉందన్నమాటే. దాన్నేగా నీవు మొదట చూసింది?

రాజ. మరల నన్ను పరిశోధించుచున్నావా? తథాగతా! వీపైన నేమి? ముఖమైన నేమి? వస్తుతత్త్వపరిజ్ఞానమునకు వస్తువు నామూలాగ్రముగ బరిశీలింపవలెనా? అంచలి ఒక్క యణువును బరీక్షించిన జాలదా! భగవన్ నేను వచ్చిన పనిని గూర్చి ఇక విన్నవించుకొందును. ఆజ్ఞయా?

దిమ్మ. ఓ. కానియ్!

రాజ. నేను సామాన్యమానవుడను గాను.

దిమ్మ. నీది గొప్ప విగ్రహం. (కొద్ది బుద్ధి!)

రాజ. ధన్యోస్మి. నేను క్షత్రియాగ్రేసరుడను. ఈ నలాందా ప్రజలెల్లరు నాకఠోర శాసనమునకు బద్ధులు. నే జేసిన

పాపమును సామాన్యమానవులతో జెప్పుకొనుట అగౌరవ కరమని తలంచి నీతో చెప్పుకొనుటకై వచ్చితిని.

దిమ్మ. (బాగా బోధపడలేదు) అయితే-వుండు_మొదటిసంగతి నువ్వో పాపం చేశా నంటున్నావు. రెండో సంగతి, ఆపాపం చెప్పుకోడానికి వచ్చా నంటున్నావు. అంతేకాదూ?

రాజ. చిత్తము.

దిమ్మ. మంచిది. అంత వరకూ అర్ధమైంది. మరి-నువ్వు చేసిన పాపాన్ని ఎందుకు చెప్పదలచు కున్నావ్? అంత ప్రమాదం ఏమొచ్చింది?

రాజ. మరల పరీక్షయా భగవన్! చేసిన పాపము జెప్పుకొన్నచో పరిహారమగు ననికదా పెద్దల సూక్తి? అందువలన నావంటి అసామాన్య వ్యక్తికి నీవంటి యుత్తమోత్తమునితో జెప్పుకొనుటే సమంజస మని నిశ్చయించితిని

దిమ్మ. (అయితే, తాను కూడా వ్యాకరణ యుక్తంగా మాటలాడుట సమంజసం. భగీరథ యత్నంతో) సరియు. సరియు. నా బిడ్డా! నీ పాపమును మాకు దప్ప కెరింగించుకొని గంగత్తుంగ తరంగ శృంగ భంగుడవు గమ్ము. (ఏమైనా సరే అని సమాసాన్ని వదలేశాడు.)

రాజ. భగవన్! మరల బరీక్షయా? నీలీల యెంతో నీవాక్కును అంతిము. అగాధము! అచింత్యము! (నమస్కారము చేస్తాడు.)

దిమ్మ. (నవ్వును అపుకోడానికి దగ్గు తెచ్చుకుంటున్నాడు.

రాజ. నా పాపమును గూర్చి ఇక మొర పెట్టుకొందునా?

దిమ్మ. అవశ్యము. బిడ్డా! అవశ్యము.

రాజ మీ పవిత్రచరణ పద్మముల ముందు మోకరింతునా?

దిమ్మ ఓ.

రాజకుమారుడు మోకరిస్తాడు. దిమ్మరికి నవ్వు ఆగేటట్లు లేదు. మరి నవ్వితే కథ అంతం కాబట్టి కప్పి పుచ్చడానికి చివాలున లేచి ఆ మొండిగోడమీద నిలుచుంటాడు.

రాజ. తథాగతా! నే జేసిన ఘోర పాతకము నిక నాలింపుము.

దిమ్మ. ఆలించుచున్నాను. పుత్రా! ఆలించుచున్నాను.

రాజ. నిన్నరాత్రి — ఇచటికి సమీపమందున్న ఆ కాళీ దేవ్యాలయములో — సర్వజ్ఞా! నీవు చూచియే యుందువు-

దిమ్మ. నేనా? అబ్బే! కాళీగుడికి నే నెప్పుడొచ్చాను?

రాజ. నీవు దివ్యదృష్టి విభాసితుడవు.

దిమ్మ. (ఔను సుమీ! ఎంత పొరపాటు!) ఔను. ఔను. కాని—మరి—బిడ్డా! మానవుల పాపకృత్యముల నరయుటకై మా దివ్య దృష్టిని ఉపయోగించం సుమా.

రాజ. క్షమించుడు. క్షమించుడు. అజ్ఞానమున నట్లంటిని.

దిమ్మ. ఇహ కానియ్ నీకథ. నాకు సమాధి వేళ అయింది. (భిక్షువు మళ్లీ వస్తాడేమో అని అసలు దిగులు)

రాజ. సర్వజ్ఞా! నిన్నరాత్రి-ఆ కాళీ దేవ్యాలయములో ఆమనో హరవకుళో ద్యానములో, ఆ మంజు మంజుల కుసుమ గంధ గంధిల వాతావరణములో, ఆ రాకాచంద్ర చంద్రికా పులకిత విభావరిలో, నేను — కాళీదర్శనార్థమై పోయిన నేను — కించిన్మధు పానమత్త చిత్తావస్థయందున్న నేను— ఒక యువతిని, పూజారిణిని, నవనవోన్మేష యౌవన

ప్రాదుర్భావను, నాయున్మత్త నేత్రములతో జూచి యొడలు పులకించి – సర్వజ్ఞా! సర్వజ్ఞా! అనంతర కథా భాగమును జెప్పుటకు నోరు వెనుదీయుచున్నది.

దిమ్మ. ఇంత చాటభారతం వినడానికి నా చెవులుకూడా అవస్థ పడుతున్నయ్.

రాజ. ఆ యువతి పేరు మీవద్ద దాముచేల! సర్వజ్ఞా! ఆమె ఆ గుడిపూజారి భార్య. పేరు మాయ – మాయాదేవి.

అంటూ ఉండగానే మాయ ప్రవేశం

మాయ. రాజకుమారా! ఇక్కడికి వచ్చి ఇదా మీరు చేస్తున్న పని?

రాజ. మాయా! చేసిన పాపము చెప్పవలదా!

మాయ. వీడెవడా! ! ఎవడీవాలం లేని వానరం!

రాజ. (లేచి మాయను కొంచెం దూరంగా తీసుకొనిపోయి చెవిలో) ప్రియా! నీపేరు బయట పెట్టలేదు సుమా.

మాయ. అబద్ధం. నా చెవులతో విన్నాను.

రాజ. అనగా - మరి - అంటే - అది - నీ పేరుకాదు. మరొక మాయాదేవి పేరు.

మాయ. (కోపం. ప్రణయం.) నావంటి మాయ మరొక రున్నారా మీకు! పురుషు లెంత వంచకులు! ఈసంగతి నాకు మొదటనే ఎందుకు చెప్పలేదు.

రాజ. కాదు – మరి – మాయా! – మాటవరుసకు అట్లంటిని. క్షమించు. మాడు! ఈయన మహాత్ముడు. అగాధలీలా సముద్రుడు.

మాయ. వీడా! వీడు! హాస్యాస్పదం. ఎవడో నిర్భాగ్య వేషధారి.

దిమ్మ. నారీ! అభక్తుని ధర్మాచరణానికి అలా ఆటంకం కలిగించ వచ్చునా?

మాయ. నోరు ముయ్.

రాజ. ఎంత మాటంటివి! (దిమ్మరితో) భగవన్! క్షమించు. మాయా! భగవన్నింప సారక పోతువుసుమా!

మాయ. ఇంత మాహాత్మ్యమా! రాజకుమారా! వీడెవ్వడో మాటల దొంగ.

పై సంభాషణ జరుగుతున్న సందర్భంలో ఇక కాలికిబుద్ధి చెప్పటం సమంజసమని నిశ్చయించుకొని దిమ్మరి మొండి గోడనుండి మెల్లనదిగి చల్లగాపారిపోతున్న సమయంలో-

రాజ. (అతడికి అడ్డంతగిలి మోకరించి) భగవన్! నా పాపము పరిహారమైనదా!

దిమ్మ. అయింది. అయింది. ఇక నేను పోవాల, పాపం! ఒక నిరు పేద-బహుకుటుంబీకుడు-నా సాయం అర్థించి నాకోసం కనిపెట్టుకొని వున్నాడు. ఆసంగతే మరిచిపోయా. ఇక తొందరగా పోవాలి.

మాయ. పో! వంచకా! పో!

రాజ. మాయా! ఏమి నీ ధూర్తత్వము. భగవన్! క్షమించు. నాయొసంగు స్వల్పనివేదనమును స్వీకరించి నన్ను బునీతు నొనరించుము. (ఒకచిన్న మొహిరీల సంచిని రొండినుంచి తీస్తాడు)

మాయ. రాజకుమారా! మీకు పూర్తిగా మతిపోతున్నట్లున్నది. వీడెవ్వడో జేబుకత్తెరదొంగ. నామాటవినండి.

దిమ్మ. కుమారా! నీవిచ్చే కానుకను ప్రతిఫలాపేక్షరహితంగా నిష్కామకర్మబుద్ధితో శ్రీకృష్ణార్పితంగా ఇస్తే స్వీకరించటానికి మాకు ఎలాంటి అభ్యంతరమూ లేదు.

రాజ. (సంచి ఇస్తూ) శ్రీకృష్ణార్పణమస్తు.

దిమ్మ. (తీసుకుంటూ) తథాస్తు. (నిష్క్రమణం)

మాయ. ఎంత మోసం? ఎంత వంచకత్వం?

రాజ. ప్రియా! అతడు వంచకుడని నీ అభిప్రాయము. మహాత్ముడని నా నిశ్చితము. చూచిన చూపు వెంబడినే ఏ మానవు డేవర్గమునకు చెందెనో నిర్ణయింపగల సూక్ష్మ విచక్షణజ్ఞానము నాకు జన్మతో వచ్చిన సుగుణము. నన్ను వంచింప గల్గిన వ్యక్తి నేటివరకెందును బొడగట్ట లేదు. (నాటకంలో శృంగార నాయకుడిలాగ భంగిమ పెడుతూ) అనగా - ప్రియే! నీ వాక్కు లెవు తప్ప-

అంటూ వుండగా భిక్షువు ప్రవేశం.

మాయ. చూడండి రాజకుమారా! ఈయనే నిజమైన మహాత్ముడు. గమనించండి. ఈ బ్రహ్మ తేజ మెక్కడ! ఆ వానర వాలకం ఎక్కడ?

రాజ. బ్రహ్మతేజమా? బోడితల, బూడిదయొడలు, కాషాయ వసనము. ఇవియేనా బ్రహ్మ తేజమునకు చిహ్నములు. హిహిహి! ప్రియా! మీ స్త్రీలు ఇట్టి వేషధారులను చూచి ఎంత సులభముగా మోసపోవు చుందురు!

మాయ. వేషధారి కాడు. ఈయనే నిజమైన మహాత్ముడు.

రాజ. నీకెట్లు తెలియును!

మాయ. నే చేసిన పాపం ఈయనకే చెప్తున్నా.

రాజ. వీనికా? నా పేరు కూడ వెల్లడించితివా యేమి.

మాయ. ఔను.

రాజ. ఇకనేమి? ఈ దేశదిమ్మరి వాడవాడలా దండోరా వేసి నా పరువును నట్టేట కలుపక మానడు.

ఇంతలో ఆ భిక్షువు మాయయొక్క మొహిరీలసంచిని మొండి గోడ మీదనుంచి అందుకొని

భిక్షు. యువతీ! ఇదిగో, నీ పాపసంచితం. ఆ బికారియెవడో దీల్లో నాణాల్ని దొంగిలించి పారిపోతుంటే తోవలో పట్టుకొని మళ్ళీ తీసుకున్నా. (అంటూ నాల్గు మొహిరీలు సంచిలో పెట్టి మాయకు అప్పగిస్తాడు.)

మాయ. (తీసుకుని), ధన్యవాదాలు. భగవన్! మీ మహిమ తెలుసుకోలేక ఈ రాజకుమారుడు కొంచెం పరుషంగా భాషించాడు. క్షమించాలి.

భిక్షు. బొత్తుగా అనవసరం. అతడు నన్ను గూర్చి చెప్పిన దంతా సత్యం ధ్రువం. (అంటూ గోడ యెక్కి యధాస్థానంలో యధారీతి గా కూర్చుంటాడు.)

రాజ. వింటివా? మాయా? తాను మహాత్ముడను గానని తానే యొప్పుకొను చున్నాడు.

మాయ. అదే మహాత్ముల లక్షణం.

రాజ. (మాయ ఇంకొకర్ని మెచ్చుకోవడం చాలా దుస్సహంగా ఉంది.) ఏయ్! నీవు వేషధారి వగునా? కాదా? నిక్కము వచింపుము.

భిక్షు. వేషధారి కాని మహాత్ముడు యుగానికి ఒకడైనా

ఉండవచ్చు. కాని బుద్ధిహీనులు గాని యువకులు మచ్చుకైనాకనిపించరు.

రాజ. ఏమీ! నన్ను బుద్ధిహీనుడంటివా?

భిక్షు. కాదని నీవు నిరూపించుకో లేదాకా అనక తప్పదు.

రాజ. ఎవరితో భాషించుచున్నావో తెలియునా?

భిక్షు. వీనులుండీ వినజాలని, కనులుండీ కనజాలని ఒక నరాకృతియంత్రంతో.

రాజకుమారుడు తాను కప్పుకున్న అవకుంఠనాన్ని గభాలునతీసేస్తాడు. నెత్తిమీద నవరత్న ఖచిత కిరీటంతో- మెడలో అమూల్య మణి ముక్తా హారాలతో- ఒరలో కత్తితో- కనిపిస్తాడు. అజంతా శిల్పాల్లో నుంచి ఒక బొమ్మనడచివచ్చిందా అన్నట్లు ఉంది అతనివిగ్రహం.

రాజ. ఓ గర్వితుడా! ఇక తెలిసికోనుము. ఈనలాందా మండలమును శాసించు హిందూ ప్రభుడను నేను. నాకరవాలము అరివీర మత్తేభములకు సింహ స్వప్నము. అపరాధీ! సుక్షత్రియునవమానించితివి. ఫలితము సత్వరమే నీ కనుభావ్యమగుగాక. (ఒరలో కత్తిమీద చెయ్యివేస్తాడు.)

మాయ. (చెయ్యిపట్టుకుని) ఏమిటిది రాజకుమారా? ఇలాటి అవతార పురుషులను వధించి మహా పాతకాన్ని మూటగట్టుకుంటారా?

రాజ. తాను అవతారపురుషుడు కానని తానే ఒప్పుకొనెను. నీవు వినలేదా?

ఇంతలో భిక్షువు చివాలున లేచి ఆ మొండిగోడమీద నిలబడతాడు. ఆ గోడ, దానిమీద అతని ఆజానుబాహు

విగ్రహం. ఆ అలౌకిక తేజస్సు, ఆ పురాతన శిధిల పరిస రాలు, అవన్నీ ఒకదానిలో ఒకటి లీనమైపోయి ఆ దృశ్యానికి ఒక అనిర్వాచ్యగంభీరతను ఆపాదిస్తున్నాయి. ఆ భిక్షువుముందు ఇప్పుడు ఆ యిద్దరూ వెలవెల బోతున్నారు.

భిక్షు. క్షత్రియుడా! నన్ను వధించు. కాని, హెచ్చరిక! నేను వధింపబడిన మరునాటినుండి నా పేరుతో గుళ్లు గోపు రాలు ఊరూరా నిర్మించడం, అక్కడికి నీకన్న బుద్ధి హీనులేగాక నీకన్నబుద్ధిమంతులుకూడా భక్తినిబద్ధాంజలులై రావడం సంభవిస్తుంది ఆ మందలో నీ వొకడవు!—

రాజ. ఏమిా? మందలో నొకడనా? నేను! నలాంగా రాజ్య-

భిక్షు. జీర్ణశిధిల—

రాజ. సింహాసనా ధిష్ఠాతను, మందలో నొకడందువా?

భిక్షు. కొంచెపు బుద్ధులకే అలాంటి పదవుల గొప్ప. దొడ్డ బుద్ధికి అవియొడారిలో ఎండ మావులు.

మాయ. సుభాషితం! సుభాషితం!

రాజ! (మాయతో) బుట్టవలె పొగడుచున్నావు. నీవెంత? నీ జ్ఞానమెంత?

భిక్షు. వేదాంతీ! జ్ఞానమంటే యేమిటో కొంచెం నీవే చెప్పు. చెప్పవేం?

రాజకుమారుడు తెల్లబోయి సమాధానం కోసం మాయ వంక చూస్తాడు. మాయ పక్కన నవ్వగా ఆతడు తలవంచుకుంటాడు.

మాయ. రాజకుమారా! ఇహానండి! శృంగ భంగానికి నాంది ప్రస్తావన అయింది.

భిక్షు. సరే. జ్ఞానమంటేయేమిటో నే నే చెబుతా. యువకుడా! తలయెత్తి ఒక్కసారి నా ముఖం కేసి చూడు!

రాజకుమారుడు యిప్పటికే పరాజితు డయ్యాడు. దిగ జారిన గుండెతో తలయెత్తి భిక్షువుముఖంకేసిచూస్తాడు.

భిక్షు. నేరస్తుడా! మాట వరసకు, ఈ యువతి భర్తను నేనే అనుకో.

రాజకుమారుడి మొహాన్ని నెత్తురుచుక్క లేదు.

భిక్షు. ఈ భిక్షువు యెదుట ఎంత ధైర్యంతో నీ పాపాన్ని వెల్లడించావో, అదే ధైర్యంతో ఈమె భర్త ముందు వెల్లడించగలవా!

రాజ. (అర్థమైంది. తల వంచుకుంటాడు.)

భిక్షు. అదే - జ్ఞానం ! పో! పోయి ఆమె భర్తను వెతికి పట్టుకొని అతడికి నీ పాపాన్ని చెప్పుకొని ఆవిధంగా పరిహారం పొందు. అది జ్ఞానం. ధీరుడా ! అరివీరమత్తేభసింహ స్వప్ననా! వణుకుతున్నా వెందుకు? పో! పో!

వణికిపోతూ మాయను ఒక చేత్తో పట్టుకుని వంచిన తల యెత్తకుండా ఒక్కొక్క అడుగేవేస్తాడు. మాయకూడా తల వంచుకుని ఉంది. వణికిపోతున్నది. ఆ విధంగా యిద్దరూ వెళ్ళిపోతున్న సమయంలో.

భిక్షు. (మేఘగర్జాగాంభీర్యంతో) చేసిన పాపమట! చెప్పుకొను టకు వచ్చిరట! జ్ఞానుల లక్షణమట! ప్రాపంచిక సంగం

లేని బైరాగులముందు, నోరు లేని పాషాణప్రతిమలముందు, వంకవంకదండములిడి లెంపలువైచుకొని లంచము లర్పించుకొని ధన్యోస్మి యని తృప్తినొందజూచు ఓ మదమత్త యువతీ యువకులారా! పొండు! మీకు కావలసినవి బైరాగుల యాశీస్సులు కావు - భగవంతుని యనుగ్రహమూ కాదు - ఎవని శయ్యను మీరు కలుషిత మొనర్చిరో ఆ మగడు మీ మొగములమీద ఉమియు నిష్ఠీవనం - వాని కశాఘాతం - వాని పాదతాడనం, ఇదే పరిహారమార్గం. పొండు! పొండు!

భిక్షువు ఈవిధంగా గర్జిస్తుండగా తెర నెమ్మదిగా దిగుతుంది.



# మనవి

గిల్బర్ట్ అండ్ సలివాన్ అనే జంటకవులు ఇంగ్లీషుభాషలో అనేక గేయ నాటకాలను (Operas) రచించారు. వాటిల్లో 'మికాడో' 'గొండోలియన్స్' 'పైరేట్స్ ఆఫ్ పెంజాన్స్' 'యుటోపియా' మొదలైనవి విశ్వవిఖ్యాతిని పొందినవయ్. ఈ 'అల్లీముతా' రచనలో నేను వారి పద్ధతినే అనుసరించాను—

మన సాంప్రదాయానికి గేయనాటిక చాలా కొత్త. అయినా ప్రేక్షక జనాన్ని చాలా సులువుగా రంజింపం జేయడానికి గేయనాటికలో అమోఘ శక్తివుంది కాబట్టి ఆశతో ఈ ప్రయత్నం చేశాను—

గేయనాటికల్లో రెండు రకాలున్నయ్. పద్య (కీర్తన) ప్రధానంగా వుండేవికొన్ని — గద్య పద్య (కీర్తన) మిశ్రితంగా వుండేవి కొన్ని. ఈ 'అల్లీముతా' గద్య పద్య (కీర్తన) మిశ్రితం-

ఈ నాటికా ప్రదర్శనాన్ని గురించి మరోపుటలో కొన్ని సలహాలు చేశాను. ప్రదర్శకులకూ నటులకూ అవి సాయపడితే కృత కృత్యుణ్ణి.

రచయిత

# రంగసామగ్రి

రంగస్థలం అడివి— దట్టంగావుండే చెట్లకొమ్మలు నరికితెచ్చి రంగస్థలంవెనక గజిబిజిగా పాతితే సరిపోతుంది. అడివి కర్టెన్ కంటే ఈ పద్ధతి సమంజసం.

రాతిబండ — అలీబాబాకు ఇది ఆసనం. జాజిచెక్కల పెట్టెకుగాని చిన్న పీపాకుగాని కాగితాలు అంటించి రంగు పూస్తే సరిపోతుంది.

ఈ నాటికాప్రదర్శనానికి రంగస్థలం ఎంతవిశాలంగా వుంటే అంతప్రశస్తం. ఎందుకంటే దృశ్యంలో ఎనిమిదిమందిపాత్రధారులూ, మరికొంతిమంది అనుచరులూ ఉంటారు. ఇదిగాక, కట్టెలు కొట్టడానికీ వంట వండడానికీ రాట్నం వడకడానికీ అలీబాబాకూర్చోడానికీపాత్రధారులు అటూఇటూ మెసలడానికీ ఈ వైశాల్యం చాలా అవసరం.

# నా టి క సా మ గ్రి

అల్లీబాబాకు హుక్కా

దొంగ లందరికీ లాఠీలూ బాకులూ

వంటకట్టెలు - గొడ్డలి

పొయ్యా - వంటా

రాట్నం - నూలు వగైరా

రింగప్పకు సన్నాయి

రామప్పకు ఢోలు

ఇద్దరికీ మంగలిపొదులు

# సలహాలు

(1) పాత్ర ధారు లందరికీ ఒకే రకం దుస్తులు (Uniform) వుండాలి. ఈ దొంగలు నాటు దొంగలు కారు. నాగరీకులు. కాబట్టి దుస్తులు అ నాగరికంగా ఉండ వలసిన అవసరంలేదు. అందరికి ఒకేరకం తెల్లజుబ్బాలు, తెల్లవి బుట్టలాగూలు, నడుము లకు నల్లటి కాసెగుడ్డ బిగింపులు, కాళ్లలో తెల్లటిబాపుజోళ్లు, మెడలలో నెక్ టైమాదిరిగా వ్రేలాడ కట్టబడిన నల్ల గుమాళ్లు, తల మీద ఎర్రని గాంధీటోపీలు, టోపీలమీద 'అల్లీముఠా' అనే సువర్ణాక్షరాలు, ఉండాలి. ఇవన్నీ గాక, అల్లీ బాబాకు ప్రత్యేకంగా జుబ్బామీదనుండా (జందెంలాగ) ఒకజరీపట్టానుకడితే అతను ఆ ముఠాకు పెద్ద(కెప్టెన్) అని తెలుస్తుంది—

(2) గేయనాటికకు వంతపాట ప్రాణం. వంతచెప్పే నటులు ఎంతహుషారుగా వుంటారో అంతరమ్యంగా ఇది రక్తి కడుతుంది—

(3) వ్యష్టి అభినయంకంటే సమిష్టి అభినయం దీనికిముఖ్యం. నటులసమిష్టి సహకారం (Team-Work)మీద దీని బాగోగులు పూర్తిగా ఆధారపడివుంటయ్.

(4) సాత్త్వికాభినయంకంటే దీనికి ఆంగికాభినయం (Gestures) ముఖ్యం వంతచెప్పే నటులుతమఆంగికాభినయాన్ని ఎన్నో సార్లు రిహార్సల్సు చేసి మిలిటరీ డ్రిల్లులాగా ఏకపద్ధతిని సుశిక్షితం చేసు కోవాలి.

(5) ఇది హాస్యరస ప్రధానం. సరికదా అని అతిగా అభినయిస్తే ఔచితీభంగం. తాను నవ్వకుండా ప్రేక్షకు లనునవ్వింపగలిగిన వాడే ఉత్తమ హాస్యనటుడు.

రచయిత

# పాత్రలు

అల్లీబాబా — దొంగలనాయకుడు (ఈ అల్లీబాబా అసలు అల్లీబాబా కాదు ఇది వట్టి బిరుదనామం)

షేకుమియా — మంత్రి

చౌదరి — అనుచరుడు

పంతులు — ,,

బండరాముడు — ,,

రంగప్ప — ,,

రామప్ప — ,,

చిన్నారెడ్డి — ,,

పారాదొంగ — ,,

## ప్రదేశం—కొండఅడివి

సముద్రపు ఒడ్డున కొండఅడివి. దొంగలంతా అక్కా-పక్కాడ గుంపులుగా కూర్చున్నారు. కొందరు కత్తులు కొడుతున్నారు. కొందరు రాట్నాలువడుకుతున్నారు. కొందరు వంటలు వండుతున్నారు. ఒకరాతిబండమీద కూర్చునిఅల్లీబాబా (ఇది వట్టిబిరుదనామం.) హుక్కా-పీలుస్తున్నాడు. అతడికి ఒకదొంగ విసురుతున్నాడు. ఇద్దరుదొంగలు లాఠీకర్రలతో పారా యిస్తున్నారు. ఈదృశ్యం రెండునిమిషాలపాటు మూగి దృశ్యంగా వుంటుంది. అప్పుడు దూరంగా వస్తున్న మంగలి రంగప్పనూ మంగలి రామప్పనూ చూచి పోలీసు వాళ్ళేమో అని అనుమానించి, ఒకపారాదొంగహుషారు చేస్తున్నాడు.

పారా. ఎవరో ఇటే వస్తున్నారు. పోలీసు వాళ్ళేమో! హుషార్!

అంతా. హుషార్! (లేచివచ్చి అల్లీబాబాకు అటు ఇటూ బారుగానిలబడతారు.)

షేక్. నై భాయీ నై! పోలీస్ ఆద్మీహై తేసంకళ్ళపాదులూ, పీపుమీద నక్షాయీ, బుజంమీదఛోలూ, హెందుక్కా-వుంటయ్? పోలీస్ కాదురే—హజామ్—మంగలి—

చాద. ఒకవేళ ఏదైనా రాజ కారణం చేత పోలీసు వాళ్ళకి ఇప్పుడు పాదులు వచ్చాయేమో!

షేక్. సరే. రానియ్ చూద్దాం. సబ్ భాయియో! హుషార్! అంతా! హుషార్! (అట్టహాసం)

మంగలి రంగప్పా మంగలిరామప్పా ప్రవేశం. ఇద్దరి చంకల్లోనూ పొమలువున్నయ్. రంగప్పవద్ద సన్నాయి వుంది. రామప్పవద్దడోలువుంది.

రంగ. అన్నా! ఈళ్ళంత్రా ఎవరో గొప్ప సిపాయీల్లాగా కనపడుతున్నారు.

రామ. నాకుసూత్రం అనుమానంగానేవుంది.

షేక్. ఎవరు మీరు!

అంతా. ఎవరు మీరు?

రంగ. ఈళ్ళల్లోనైనా చేరితే, ఏదైనా జీవనాధారం దొరుకుతుందేమో? మొరపెట్టుకుందామా?

రామ. సరే. కానియ్.

షేక్. మాట్లాడరేం?

అంతా. మాట్లాడరేం?

రంగ.<br>రామ. } మారాజుల్లారా! దండాలు! దండాలు!

షేక్. ఎవరు మీరు?

అంతా. ఎవరు మీరు?

షేక్. ఎందుకు వచ్చారు?

అంతా. ఎందుకు వచ్చారు?

రంగ. సిత్తం బాబూ సిత్తం

రామ. మా గోడు యినండి బాబూ! యినండి!

## రంగప్ప రామప్పల పాట

'భజనచేసే విధము తెలియండి!' శైలి.

ఈపాటలో ఇతరులు వంత పాడేటప్పుడు రంగప్ప సన్నాయి వాయిస్తాడు. రామప్ప డోలు వాయిస్తాడు.

రంగప్ప రామప్ప కలిసి

మంగలోళ్ళని మాకు పేరండీ! నరులారా! మాదు
సంగతిని మీ రాలకించండి! —

సంగతిని మీ రాలకించి సక్కాగామము చేర్చుకుంటే
డబ్బు దమ్మిడి లేకమీకు సుబ్బరంగా గీకుతాము॥

అందరూవంత

మంగలోళ్ళని వీరి పేరండీ! నరులార! వీరి
సంగతిని మన మాలకించుదము —
సంగతిని మన మాలకించి సక్కాగా వీరి జేర్చుకుంటే
డబ్బు దమ్మిడి లేక మనకు సుబ్బరంగా గీకుతారు॥

రంగప్పరామప్పలు ఇక్కడనుంచి చెరోచరణం పాడతారు.

కాపురం బెజవాడ పురమండీ! నరులార! నేటికి
మాకు దానికి తీరెబుణమండీ! అణుమాత్రమైనా
తప్పు మాయది కాదు సుమ్మండీ! చెప్తాం వినండీ!
పొద్దునని మేల్కొందుము సుమండీ! ప్రతిరోజు మేము
పాదిని చంకను పెట్టుతామండీ! బాజారులో మూ
ప్రొద్దులూ చెడతిరుగుతామండీ! మాపేరు చెప్పి
పెద్దకేకలు పెట్టుతామండీ? గడ్డాలు మాసిన
పెద్ద చిన్నల వెతుకుతామండీ! వినయాన మొక్కి

ముద్దుగా మే మడుగుతామండీ ! 'గెటవుట్ ! ఫూల్' అని
గద్దరించుక వెళ్ళుతారండీ!

ఇద్దరూ కలిపి

ఏమి చెప్పం స్వామితండ్రీ! సీమకత్తులు అవతరించె
ఎవడి కతడే మంగలాయె? ఎందు జూచిన క్షౌరమాయె !
మంగలోళ్ళని మాకు పేరండీ ! నరులార......వగ్గైరా ॥—

అందరూ వంత

ఏమి చెప్పం స్వామితండ్రీ ! సీమకత్తులు అవతరించె
ఎవడి కతడే మంగలాయె ! ఎందుజూచిన క్షౌరమాయె!
మంగలోళ్లని మీరి పేరండీ ! నరులారా......వగ్గైరా॥—

చేరో చరణం

చెన్నపట్నం పోయినామండీ ! నరులారా! శ్రీయుత
పొన్నసామిని గొల్చినామండీ ! సొన్నాయివిద్యను
మిన్నుముట్టగ నేర్చినామండీ! 'సపసాస' అందు
మమ్ము మించినవారు లేరండీ ! మద్రాసులో మే
మున్నదే పది నెలలు సుమ్మండీ ! ఆకాలమందే
కొన్ని అలావాట్లాయెను గదండీ ! మార్నింగునే ఇ
డ్డెన్ను లొక పన్నెండు చాలండీ! ఆవెంటనే మా
కెణ్ణరే కాఫీయు చాలండీ ! ఈ రీతిగా మా
కన్ని అప్పులు పెరిగెను గదండీ ! ఆ శంకరయ్యరు
మమ్ము వీధిని బెట్టినాడండీ !

ఇద్దరూ కలిసి

ఏమి చెప్పం స్వామితండ్రీ ! పోయెఅప్పుల కింద సొన్నాయ్
కల్లు మెలనిపించె కాఫీ ! ఇల్లుసాఫీ ! ఒళ్లు మాఫీ !
మంగలోళ్ళని మాకు పేరండీ ! నరులార— — —వగ్గైరా॥

అందరూ వంత

ఏమి చెప్పం స్వామి తండ్రీ! పోయె అప్పాలకింద సొన్నాయ్
కల్లు మేలనిపించె శాఫీ! ఇల్లు సాఫీ! ఒళ్ళు మాఫీ!
మంగలోళ్లని వీరి పేరండీ! నరులార— — —వగైరా॥

చెరో చరణం

'మంగలీశ్వర' బిరుదు మాకండీ! నరులార! హె యిర్ క
ట్టింగు సేలూన్ పెట్టినామండీ! పోటీలుపడి క్రా
పింగు శానికి చేసినామండీ? దమ్మిడికి ఒక షే
వింగు చొప్పున గీకినామండీ! ఐనప్పటికి పెను
భంగ మొందుట తప్పలేదండీ! ఏమంటే, మా షే
వింగులన్నియు అగువు లేనండీ! బాకీలు 'ఎగ గొ
ట్టింగు' 'హెజ్‌స్కాండింగు' సుమ్మండీ! ఆదెబ్బతో షే
వింగు సేలూన్ క్షౌరమయెనండీ! పొని చంక నిండి 'థం
కింగు' మ" మరి చేసినామండీ! 'నో దెమ్మలకు షే
వింగె రైట్' అని తోచినది సుండీ! కాబట్టి రేపుకు
టింగు టింగున పోయినామండీ! దినమెల్ల ఆట వెతు
కంగ నిష్ఫలమాయెను గదండీ!

ఇద్దరూ కలసి

ఏమి చెప్పం స్వామితండ్రీ! విధవలే కనరారు జగతిని
ఉన్నవారికి జుట్లు మొలిచె! ఊరి మంగలి దీపమారె!
మంగలోళ్ళని మాకు పేరండీ! నరులార— — —వగైరా॥
సంగతిని మీరాలకించి సక్కగా మ.సా— — — వగైరాకి॥

అందరూ వంత

సంగతిని మన మాలకించాం సక్కగా యిక చేర్చుకుందాం
డబ్బు దమ్మిడి లేక మనకు పుబ్బంగా గీలుతారు
మంగలోళ్లని వీరి పేరండీ! సరులారా! వీరి
సంగతి మన మాలకించామా.— ॥—

అల్లీ. నీపేరేమిటి?

రంగ. రంగప్ప

అల్లీ. నీపేరు?

రామ. రామప్ప.

అల్లీ. రంగప్పా! రామప్పా! మీయిద్దర్నీ మాలో చేర్చుకుంటాం. కాని కొన్ని షరతులున్నయ్. మంత్రిజీ!బోలో!

రంగ. 'మంత్రీ' అంటున్నాడు. ఎవడో గొప్ప మారాజు కామోసు!

షేక్. షరత్ హై మీఅంటే- మా ముతాలో నౌకరీసేసే హరేక్ఆద్మీ, పధిమీద హైన్మది సమ్మత్సరాల్ ఏక్‌దం హిందులో పులుండిపోవాల. ఈ పధి మీద హైన్మది సమ్మత్సరాల్కె హీముతాకీ యిడ్సి పారిపోతే, ఫట్కాని మేకపిల్లలాగా సఫాచేసిపారేస్తాం సఫా! సఫ!

అంతా. సఫా! సఫా!

రంగ. } అమ్మయో్య.
రామ. }

షేక్. మా ముతాలో నౌకరీసేసే సబ్ ఆద్మీకి హిందిషరత్ పులుండాది.

ఆల్లీ. ఒప్పుకున్నారా?

రంగ. బాబుగారు! ఒక్కొకట ప్రేమ ఇస్తే మీ అందరి గద్దాలుగికి యెళ్ళి పోతాం. దీనికి పద్దెనిమి దేళ్ళెందుకు!

షేక్. హో గర్కు అంటే, హీక్కడికివచ్చి మా ముతా రహస్యం హొడుగు నూస్తాడో, అనునూడవుడిక్కు ఘట్కోని పధిమీద హొస్సిది సమ్మక్షరాల్ బంధిఖానా సెయ్యాలా అని మాకీ శాసక్ వుంది

రామ. తమ్ముడూ! ముతా అంటున్నారు - శాసనమంటున్నారు. ఇదంతా యేకోగూడుఫుతానీలా గా వుంది.

రంగ. బాబుగారూ! 'ముతా' 'ముతా' అని అంటున్నారు. ఏంముతామిాది?

షేక్. నీకీ తెల్వాను ఛే? హిన్దోదేఖో నవాబ్ బహద్దర్ అల్లీ బాబా! మాకీ సబ్ దేఖో అల్లీకా ముతా!

రామ. అహ గొల్ల! అల్లీముతా అంటేమిారేనా? అడివికోంగలు! అడివికోంగలు! (భయంతో వణికిపోతాడు)

రంగ. (ఏకస్తూ) ఇంకేం దారిగో అన్నయ్యా!

రామ. (ఏడుస్తూ) గోదారేగోయ్ తమ్ముడో!

ఒకరిని ఒకరు గట్టిగా కౌగలించుకుంటారు.

షేక్. ఒప్పుకొన్నారా? లేదా? ఘోలో! (బాకుతీయడంనటిస్తాడు)

అంతా. ఘోలో! (బాకులు తీయడంనటిస్తాగు)

రంగ. } (గుక్కలు మింగుతూ) ఒప్పుకున్నాం. ఒప్పుకున్నాం.
రామ. }

అంతా. (ఆనందంతో చప్పట్లుకొడుతూ) ఒప్పుకున్నారు. ఒప్పుకున్నారు.

ఆయిద్దర్నీ అంతా కౌగిలించుకుంటారు.

షేక్. భోలో భాయీ రంగప్పకీ—

అంతా. జై !

షేక్. భాయి రామప్పకీ—

అంతా. జై !

షేక్. హిద్దరీ పాటుగాళ్ళ—

అంతా. జై!

రంగ. (భయంతోటి) అన్నా! నూత్తే, ఈళ్ళంతా సాలా మంచోళ్ళలాగే వున్నారు సుమా.

రామ. (భయంతోటి) నాకూ అలాగే తోచిందిరా తమ్ముడూ!

రంగ. మా జన్మలో ఎప్పుడైనా మంగలోళ్ళనూ మంగలోళ్ళ పాటుల్నీ ఇలా గౌరవించిన పెబువులు వున్నారా?

అల్లీ. రంగప్పా! రామప్పా! మమ్మల్ని గురించి మీ లోకం ఏమనుకుంటున్నది!

రంగ. మీ మురా అంతా కన్నపు దొంగలనీ—

రామ. కత్తెర దొంగలనీ—

రంగ. గూండాలనీ—

రామ. ఖూనీకోర్లనీ, అనుకుంటున్నది.

అల్లీ. సరే నేం ఎవరమో మీకై మీరే తెలుసుకోడానికి, ఒక్కొక్క భాయీనే మీకు పరిచయం చేస్తా. (రాతి బండ మీదనుంచి లేస్తూ) పంతులు భాయీ! తాంబుర

అందుకో! చాదరి భాయీ! బుర్ర అందుకో! బండ
రాముడూ! తాళం అందుకో!

వాళ్లు వాటిని అందుకుంటారు.

అల్లీపాట

బొబ్బిలికధశైలిలో కొంచెంసేపు. సమయానుకూలంగా
అందరూ వంత పాడతారు. కులాసా పుట్టినప్పుడల్లా
గంగప్ప రామప్పలు సన్నాయీ డోలు వాయిస్తారు.

అరె వాః అఅవాఃఅఅవాఃజీ! సునోజీ!

వంత

హాఃజీ సునోజీ! అరె వాఃజీ సునోజీ!

అల్లీ

ఇడుగి సుగిడుగో మాడండయ్యా జనాబు షేకుమియా
ముసల్మాను వంశాన లోకల్లా సొగసు గాడండీ షేకుమియా
అప్పరుకొడుకులు ఏడుగురు కూతుల్ జనాబు షేకుమియాకు
అమ్మా అత్తా తండ్రీకలరూ జనాబు షేకు మియాకు.
అరయెకరం మాగాణికి చాలా పంట్లుదాను షేకు
ఆకలి దప్పులు తీరక యింటిలో అలమటించె నీషేకు
సిస్తులు బాకీ పడ్డాడండీ జనాబు షేకుమియా
అరయెకరం వేలం పడెనండీ జనాబు షేకుమియాకు
మిగతా అప్పుల వాళ్ళంతా యెగబడ్డారండీ
వ్యాజ్యాల్ వేసి డిక్రీల్ పొంది పైపై వచ్చారండీ
ముంతా మూసుకు పోయిందండీ జనాబు షేకుమియాకు
కొంపాగోడీ పోయిందండీ జనాబు షేకుమియాకు
అదిచాలక ఒక అప్పులవాడు జైలుకు పంపించాడు
ఐదేళ్లపాటు సివిలు జైలు ను అలంకరించాడు

ఆకలి మంటల అల్లల్లాడేను అతని కుటుంబం పరాత్పరా!
పిల్లలపాపలతో నశించెను అతని కుటుంబం పరాత్పరా!
అయిదేళ్ళయ్యేను బయటికి వచ్చెను జనాబు షేకుమియా
అల్లీముతాను ఆశ్రయమిచ్చింది ఫంకాకొట్టేను షేకుమియా
అల్లీముతాకు ప్రైం మినిస్టర్ జనాబు షేకుమియా
సిసలైన అసలు ముసిలిం సుండీ జనాబుషేకుమియా.

అల్లీ. బోలో! జనాబ్ షేక్ మియాకూ—

అంతా. జై!

అల్లీ. హిందూ ముస్లింకో—

అంతా. జై!

అల్లీ. ఇదుగో ఇంకో సోదరుడు, నిప్పులాంటి బ్రాహ్మడు ఇంగ్లీషుఅఖండంగాచదివాడు. ఎంతవరకుచదివావుభాయీ

పంతు. ఫస్టుఫారం అయిదేళ్ళు వదలకుండా చదివా.

అల్లీ. ఆ చదువు కోసం ఉన్న ఆస్తి ఎకరన్నర మెట్ట భూమి అమ్ముడు పోయింది. ఎక్కడా బతుకు తెరువు కనపడ లేదు. మీలాగే ఇక్కడికి వచ్చాడు. మన ముతాకు ఛీఫ్ ఎకౌంటెంట్ అయ్యాడు. ఊరు పప్పునగరం-పేరుమిస్టర్ పంతులు. బోలో! పంతుల్కీ—

అంతా. జై!

అల్లీ. ఇదుగో మరో సోదరుడు - కమ్మ కులాలంకారుడు- అందులోనూ కత్తిలేని పెద్దకమ్మ. అయితే సొంత భూమి ఒక్కసెంటుకూడా లేదు. ఒక బ్రాహ్మడి యీనాం పది యెకరాలు కౌలుకు తీసు కున్నాడు. నాలుగేళ్ళువరాసగా కౌలుతో బకాయి పడ్డది. కౌలూపోయింది - కాడీయెడ్లూ

పోయినయ్. అదిగాక నోటు ఒకటి కాలదోషం పట్టేసరికి ఒకమార్వాడీ కంప్లయింటు చేశాడు. దానితో సర్వనాశనం అయి పెళ్ళాంబిడ్డలు పుట్టింటికీ, తాను ఈ ముతాకీ దయ చేశారు. ఊరు గుడివాడ. పేరు అచ్చియ్యగారి బుచ్చియ్య చౌదరి. మన ముతాకు ఆహారసప్లయి శాఖామంత్రి. బోలో చౌదరీభాయీకీ-

అంతా. జై.

అల్లీ. ఇడుగో ఇంకో సోదరుడు - లోకం అంతా తనని తన కులాన్ని 'మాల' 'మాల' అని ఈసడించగా లోకంమీద అమాంతంగా తిరుగుబాటు చేశాడు. కోవలు కొట్టాడు. దోపిళ్లు చేశాడు. వీని కోసం ముగ్గురు నూరురెంట్లు మూడుజిల్లాల పోలీసులతో మూడేళ్లు తలకిందుగా తపసు చేశారు. దొరికితే ఒట్టు. ఆఖరికి ఒక బాపనయ్య ఈ అమాయకుడికి స్నేహం అయ్యాడు. ఆ బాపనయ్య రెండావుల దూడ. ఇటు ఇతగాడికి చోరీ కమీషన్ ఏజంటు. అటు పోలీసు వాళ్ళకి ఇన్ఫర్మేషన్ ఏజంటు. ఈ సందర్భంచేత దొరికి పొయ్యాడు. ఏడేళ్ళు శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరించాడు. ఇప్పుడు ఈ దివ్య సంఘాన్ని అలంకరిస్తూ వున్నాడు. మన ముతాకు యుద్ధ శాఖామంత్రి. మహానుభావుడు-ఊరు గుంటూరు - పేరు మహామేరు సమాన ధీరులైన శ్రీ శ్రీ శ్రీ బండరాముడు. బోలో! బండరాముడికీ—

అంతా. జై!

అల్లీ. రంగప్పా! రామప్పా! ఇక మీ అభిప్రాయం చెప్పండి. మేముదొరలమా! దొంగలమా!

రంగ. మీరు దొరలే. నిక్కచ్చిగా దొరలే—

అంతా. దొరలం. దొరలం.

రామ. కాని, లోకం మాత్రం మీ దొరతనాన్ని గుర్తించలేక మిమ్మల్ని దొంగలు అని అంటున్నది.

అల్లీ. బుద్ధిలేని లోకం, అందుకనే లోకం మీద సవాల్ చేశాం. ఢంకా కొట్టాం. ఇంకా కొడతాం. ఢాం ఢాం ఢాం ఢాం.

అల్లీపాట (మరె మాలాబులాలో శైలి)
రంగప్పునప్పాయీ రామప్పుడో లూనహా

ఢంకా బజావో భాయీ!
అల్లీముతాకో - ఢంకా బజావో ॥—

వంత

అల్లీ ముతాకో-ఢంకా బజావో భాయీ!

అల్లీ

దొంగలని అంటారురా దొరలు మనలా మాటికీ
బీదసాదల దోచకుండా బిరుదు కోరలెటులైరిరా?
'దొంగ' 'దొర' అన నేలరా? దొంగలే అంతానురా
పగటి దొంగలు వారురా, మరి, రాత్రి దొంగలు మనమురా
ఇంతే భేదమురా! ప్రియసోదరుడా!
ఢంకాబజావో!—

వంత

ఇంతే భేదమురా! ప్రియసోదరుడా!
ఢంకా బజావో!

అల్లీ

అడవి మృగములు చూడరా కడుపునిండితే తినవురా
బిరుదు లందిన మనుజ మృగములు ధరణినంతా మ్రింగురా
దైవమిచ్చిన ధరణిరా ఇది ఎవడిఅబ్బాసొమ్మురా?
నీకు నాకూ లేనిహక్కు వాడి కెవడిచ్చాడురా?

ఝూటా మాటలురా! ప్రియసోదరుడా!
ఢంకా బజావో—

వంత

ఝూటా మాటలురా! ప్రియ సోదరుడా!
ఢంకా బజావో—

అల్లీ

మిద్దె మేడలు తమకురా మిన్నుపందిరి మనకురా
ఏమిటిది అని యడిగితే 'మీకర్మ' అనిఅంటారురా
పప్పుకూడులు తమకురా పస్తులన్ని మనకురా
ఏమిటిది యని అడిగితే 'మీగీత' అని అంటారురా

జాలు మే న్యాయమురా! ప్రియ సోదరుడా!
ఢంకా బజావో—

వంత

జాలు మే న్యాయమురా! ప్రియ సోదరుడా!
ఢంకాబజావో—

అల్లీ

'కర్మ'అని అన్నాగురా మన కనుల తెరగి వేళాగురా
కండ పుష్టియు 'కర్మ' రా, ధనముండుటే 'ధర్మ' మ్మురా

'గీత' అని అన్నారురా, పెనుగోతిలో తోశారురా
కత్తిమొనయే 'గీత'రా, అది మెత్తబడితే 'రాత' రా

లేరా! మేలుకోరా! ప్రియసోదరుడా!
ఢంకా బజావో—

వంత

లేరా! మేలుకోరా! ప్రియసోదరుడా!
ఢంకా బజావో భాయీ! అల్లీముఠాకో
ఢంకా బజావో భాయీ!

చిన్నారెడ్డి ప్రవేశము

చిన్నా. ఆపండి మీగోల! ఆపండి!

అల్లీ. ఎవరు?—మన చిన్నారెడ్డా!

అంతా. చిన్నారెడ్డి! చిన్నారెడ్డి!

అల్లీ. చిన్నా! మళ్ళీవచ్చావా మా ముఠాలో చేరడానికి? స్వాగతం! సుస్వాగతం!

అంత. స్వాగతం ! సుస్వాగతం !

అతణ్ణి కౌగలించుకోడానికి మూగుతారు

చిన్నా. ఆగండి!

అల్లీ. చిన్నా! నీవు మునుపటి చిన్నారెడ్డివి కావా?

షేక్. హిందీ ముఠాతో నీకీ పథిమీద హెన్మది సమ్మత్సరాల్ నౌఖరీ సేశావ్—

చౌద. హస్తకౌశల్యంలో అపార పాండిత్యం సాధించావు—

పంతు. పోలీసువాళ్ళ నల్ల జాబితాలో శాశ్వతమైన చోటు సంపాదించావు—

బండ. ఈసంఘానికి బ్రహ్మాండమైన సేవచేసిధన్యులయ్యావు-

అల్లీ. పద్దెనిమిదేళ్ళు సర్వీసూ పూర్తి చేసుకున్నావు. ఇక ఈ ముఠాకు వుండడానికి ఇష్టపడక మళ్ళీ ఆలోకంలోకి వెళ్ళిపోయావు. మాచిన్నా నాకు మళ్ళీ కనపడడని అనుకున్నాం. కళ్ళు చల్లగా మళ్ళీ వచ్చావు. సంతోషం! అపారం! చిన్నా! రా! ఇదుగో మన సంఘంలోకి ఇద్దరు కొత్త రిక్రూటులు వచ్చారు. ఇతడు మహామేరు సమానధీర, మంగలీశ్వర, క్షౌరదేవేంద్ర శ్రీ శ్రీశ్రీ రంగప్ప-బోలో రంగప్పకీ—

అంతా. జై!

అల్లీ. ఇతడు రండోలుశ్రావణ, ముక్తాయిభేతాళ, శ్రీ శ్రీ శ్రీ రామప్ప — బోలోరామప్పకీ —

అంతా. జై!

అల్లీ. బోలో! అల్లీముఠాకా కమాండర్ జనరల్ చిన్నారెడ్డికీ-

అంతా. జై!

చిన్నా. అల్లీబాబా! షేక్ మియాజీ! భాయీ లోక్! నేను మీముఠాలో చేరడానికి రాలేదు.

అల్లీ. మరెందుకు వచ్చావు?

చిన్నా. మిమ్మల్ని నాతో తీసుకుపోడానికి వచ్చా

అల్లీ. ఎక్కడికి?

చిన్నా. లోకంలోకి.

అల్లీ. మేము రాము.

అంతా. మేము రాము.

చిన్నా. సోదరులారా! దొంగలంకొట్టి దోపిళ్లుచేసి క్షణక్షణం రాజదండనను ఎదురుచూస్తూ దినదినగండం నూరేళ్ళా యుస్సుగా మీజీవితాలను ఎందుకు కష్టపెట్టుకోవాలి? నాతోరండి, మళ్లీ ఆ లోకంలోకిపోదాం. పెద్దమనుషు ల్లాగా జీవనం చేద్దాం.

పేక్. పెద్దమన్సీగరహాగా వుంటే, దొంగతనంకైసా సెయ్యాలా?

చిన్నా. భాయీ లోక్! రెండేళ్లనుంచీ నేను ఆలోకంతో కలిసి మెలిసి సంచరించాను. ఆనాగరికతను ఆమూలంగా ఆకళింపు చేసుకున్నాను. అందలి రహస్యం పూర్తిగా తెలుసుకున్నాను. కర్తవ్యం మీకు వివరంగా చెబుతా. నా సలహా విని ఆలోకంలోకి మళ్ళీపోదాం రండి.

అల్లీ. ఏమిటి నీ సలహా?

అంతా. ఏమిటి నీ సలహా?

చిన్నారెడ్డి పాట.

రంగప్ప నన్నాయీ రామప్ప డోలూ నహా.

ఈపాటకు ఇష్టంవచ్చిన శైలి.

వద్దుర మనకీ దొంగతనం - ఇక
వద్దుర మనకీ దొంగతనం॥— (పల్లవి)

ఇల్లు కదలకయె ఇలను దోచుకొను
ఇతర మార్గములు కలవుర భాయీ॥—(అనుపల్లవి)

వంత

ఇల్లు కదలకయె ఇలను దోచుకొను
ఇతర మార్గములు కలవట భాయీ!—

వద్దుర మనకీ దొంగతనం - ఇక
వద్దుర మనకీ దొంగతనం॥—

చిన్నారెడ్డి

జేబులు కొడితే ఛీమై పుడతావ్
కన్నము వేస్తే ఖరమై పుడతావ్
దోవలు కొడితే దున్నై పుడతావ్
ఇహ పరములు రెండింటికి చెడతావ్
వద్దుర మనకీ — వగైరా

వంత

వద్దుర మనకీ —వగైరా

చిన్నారెడ్డి

కాషాయ్ గుడ్డలు కట్టర భాయీ
కర్మను గురించి చెప్పర భాయీ
జగత్తు మాయా అనరా భాయీ
జై శంకర అని అరవర భాయీ

జగద్గురువు అవుతావుర భాయీ
సాష్టాంగములే పడెదరు భాయీ
భిక్షలు అక్షలు వస్తయ్ భాయీ
కుక్షికి లోపం వుండదు భాయీ

శాస్త్రం చట్టం సమ్మతించితే
దొంగయె దొరరా భాయీ!

వంత

శాస్త్రం చట్టం—వగైరా (పల్లవి అనుపల్లవి సహా)

## అ ల్లీ ము శా

చిన్నా. రెడ్డి

జ్యోతిషాలయం పెట్టర భాయీ
టైపు మెషీన్లను కొనరా భాయీ
కాపీల్ కొన్నిటి కొట్టర భాయీ
వి. పి. సిస్టం పెట్టర భాయీ

పూర్తి జీవితం ఇరవై రూకలు
సగము జీవితం పదియే రూకలు
మాస జీవితం రెండే రూకలు
అకోట ప్రశ్నకు ఒకటే రూక

శాస్త్రం చట్టం సమ్మతించితే
దొంగయొ దొరరా భాయీ!

వంత

## శాస్త్రం చట్టం—వగైరా (పల్లవి అనుపల్లవి సహా)

చిన్నా రెడ్డి

లిమిటెడ్ కంపెని పెట్టర భాయీ
షేరులు కొన్ని వేయర భాయీ
మిగిలిన షేరులు అమ్మర భాయీ
మేనేజింగును చేయర భాయీ

దివాల తీస్తే దేవుడితప్పు
తియ్యకపోతే నీదేఒప్పు
లెక్కలు మాత్రం సరిగా చెప్పు
లేకుంటే నీతలపై ముప్పు

శాస్త్రం చట్టం సమ్మతించితే
దొంగయొదొగరా భాయీ

వంత
శాస్త్రం చట్టం—వగైరా (పల్లవి అనుపల్లవి నహా)
చిన్నారెడ్డి

వందకు పుట్టెడు కొనరా భాయీ
బస్తానలభైకమ్మర భాయీ
అధికార్లకు దండాలు వెయ్ భాయీ
స్వాగత పత్రాల్ చదవర భాయీ

అణాకు గిట్టిన సరుకులు భాయీ
అర రూపాయికి అమ్మర భాయీ
ఇది తగునా అని అడిగితె భాయీ
వ్యాపారం అని చెప్పర భాయీ

శాస్త్రంచట్టం సమ్మతించితే
దొంగయె దొరరా భాయీ!

వంత
శాస్త్రం చట్టం—వగైరా (పల్లవి అను పల్లవినహా)
చిన్నారెడ్డి

డబ్బుపెట్టి పేకాడకు భాయీ
దొబ్బుతారు పోలీసులు భాయీ
లైసెన్సులనే పొందర భాయీ
ఎగ్జిబిషన్లే పెట్టరభాయీ

లైసెన్సులతో లాటరి చేస్తే
లాఫుల్ వ్యాపారమురా భాయీ
లైసెన్సంటే చాలుర భాయీ
లంజెల బ్రోథల్ తెరవర భాయీ!

శాస్త్రం చట్టం సమ్మతించితే
దొంగరయొ దొరరా భాయీ !

వంత

శాస్త్రం చట్టం—వగైరా (పల్లవి అనుపల్లవి సహా)

చిన్నారెడ్డి

వైద్యం చాలా మంచిది భాయీ
మందులు తయారు చేయర భాయీ
చక్కటి సీసాల్ కొనరా భాయీ
రంగులనీళ్లే కలపర భాయీ

తెల్లవెంట్రుకలు నలుపౌ నరా
నల్ల చర్మములు తెలుపౌ నరా
వృద్ధుడు పడుచై లేచును అనరా
గొడ్రాలికి సంతానం అనరా

శాస్త్రం చట్టం సమ్మతించితే
దొంగరయె దొరరా భాయీ

వంత

శాస్త్రం చట్టం—వగైరా (పల్లవి అనుపల్లవి సహా)

చిన్నారెడ్డి

అర్థరాత్రి నిద్రలేర భాయీ
ఊరివెలపలికి పోరా భాయీ
రాముడిబొమ్మను పాతర భాయీ
వెలిసిం దని నమ్మించర భాయీ

భజనలు పూజలు చేయుగభాయీ
భక్తులు వందలు వస్తార్ భాయీ

బండ్లను కాన్కలు తెస్తార్ భాయీ
దేవుడి పేరిట తినరా భాయీ

శాస్త్రం చట్టం సమ్మతించితే
దొంగయె దొరరా భాయీ!—

వంత

శాస్త్రం చట్టం—వగైరా (పల్లవి అనుపల్లవి సహా)

చిన్నారెడ్డి

దోపలువద్దు దోపిడివద్దు
దొంగతనం మన కసలే వద్దు
ఇల్లు కదలకయె ఇలపు దోచుకొను
ఇతర మార్గములు ఇవిరా భాయీ!—

వంత

దోపలువద్దు—వగైరా-

చిన్నారెడ్డి

పదండి పోదాం ప్రపంచమునకు

వంత

పదండి పోదాం ప్రపంచమునకు

అల్లీ

నేను జగద్గురు నౌతా భాయీ
జగత్తు అంతా మాయర భాయీ

వంతులు

నేను జ్యోతిషం చెబుతా భాయీ
హనుమత్ప్రసన్న మంటా భాయీ

చౌదరి

లిమిటెడ్ కంపెని పెడతా భాయీ
లిక్విడేషనుకు చూస్తా భాయీ

చిన్నారెడ్డి

వ్యాపారమునే చేస్తాభాయీ
పదులకు వందలు తీస్తాభాయీ

శేషు మియా

లైసెన్సుల నే తెస్తా భాయీ
లాటర్లను ఆడిస్తా భాయీ

బంత రాముడు

పసరులు పూతలు పూస్తా భాయీ
ముసలిని పడుచుగ చేస్తా భాయీ

రామప్ప రంగప్పలు కలిసి

దేవుణ్ణే సృష్టిస్తాం భాయీ
దేవుడి గుడి కట్టిస్తాం భాయీ

అందరూ కలిసి

జేబులు కొడితే చీమ్మై పుడతావ్
కన్నము వేస్తే ఖడ్మై పుడతావ్
దోపలు కొడితే దున్నై పుడతావ్
ఇహ పరములు రెండింటికి చెడతావ్

శాస్త్రం చట్టం చెప్పిన రీతి
సంచరించితే ధన్యుడవౌతావ్

భుక్తి ఇహమున
ముక్తి పరమున
రారా పోదాం! రారా పోదాం!
ఇల్లు కదలకయే ఇలను దోచుకొను
ఇతర మార్గములు చూద్దాం! చూద్దాం!
రారా భాయీ! రారా భాయీ!

వద్దురా మనకీ దొంగతనం - ఇక
పెద్దలమై జీవించుదము -
రారా! పోదాం! రారా! పోదాం!

చివరి వంత పాడుతూ ఆలీబాబాను మధ్యగా వుంచి అందరూ వలయాకారంగా అతడిచుట్టూ కొంతసేపు నృత్యం చేస్తారు. చివరికి ఒకరిచెయ్యి ఒకరు పట్టుకుని బారుగా ఒక్కొక్కరే నిష్క్రమించుతూవుండగా తెర మెల్లిగా దిగుతుంది.



